## నీతి మంజరి

శ్లో॥ ప్రాణం వాపి పరిత్యజ్య
మానమేవాభి రక్షతు
అనిత్యో భవతి ప్రాణో
మానమా చంద్ర తారకమ్

వ॥ ఎప్పుడే విపత్తు లే తెంచినను, మాన
రక్ష వలయు ప్రాణ రక్షకంటె
నిముసమేని ప్రాణి నిలుచునో నిలువదో ?
మాన ధనము సతము మను ధరిత్రి

శ్లో॥ దీన హస్తే ధనం దద్యాత్స్వ
భార్యాయాం చ యౌవ్వనమ్
స్వామి కార్యేషు చ ప్రాణం
నిశ్చయో మమ మాధవ

వ॥ స్వార్జితమ్ము పేదజనుల బాధలయందు
పరువము తన భార్య ప్రణయ మందు
ప్రాణము యజమాని పనులయందు వ్యయంచి
సఫలత గొనవలయు సజ్జనుండు.

శ్లో॥ దాతాదరిద్రః కృపణోధనాఢ్యః
పాపీ చిరాయుస్సు కృతీగతాయుః
రాజా కులీన స్సుకులీన సేవ్యః
కలీయుగే షడ్గుణ మాశ్రాయంతి

వ॥ దాతపేద, లోభి ధనికుండు పాపి చి
రాయువును, సుకృతి గతాయు వరయ
హీన గుణుడు ప్రభువు, శ్రేష్ఠగుణుడుబంటు
కడు విచిత్ర చరిత కలియుగంబు.

—పృధివి సుబ్బనాగయ్యకవి

## అభిప్రాయవేదిక

" ఈ మధ్య మాస్టార్ శ్రీ పి. మోహన్‌గారి ప్రోత్సాహంతో శ్రీవాణి ని చదివాను ఓ మంచి పత్రిక చదివానన్న సంతృప్తి కలిగింది. ఆనాటినుండి శ్రీవాణి ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తుంటాను. "

—ఎస్. ఎమ్. గౌరీశంకర్, కోరుకొండ

" డా. సర్వేపల్లి రాధాకృష్ణన్ జీవిత చరిత్ర చాలా బాగుంది. శ్రీవాణి ముఖచిత్రాలు చాలా బాగుంటున్నాయి. ఇటువంటి పత్రిక ప్రచురిస్తున్నందుకు ధన్యవాదములు. "

—జె. వి. రత్నం, పర్లాకిమిడి (ఒరిస్సా)

" శ్రీవాణిలో సాహిత్యం ఉన్నది, సంస్కృతీ పరిరక్షణ వుంది. ఉత్తమత్వం, ఉన్నత తత్వమూ కలుగుతుంది శ్రద్ధగా శ్రీవాణి ని అధ్యయనం చేస్తే. శ్రీవాణి ప్రజా హృదయాలను కదలించగలదు. ముఖచిత్రాలలోనే పవిత్రత, సభ్యత, జాతీయత, ఆధ్యాత్మికత దర్శన మిస్తున్నది. విజ్ఞాన ప్రదాయిని శ్రీవాణి. శ్రీవాణి ని నడపడంలో పడే సాధక బాధకాలు ఆలోచిస్తున్నాను. వదాన్యులంతా ముందుకు రావాలి జాతికి అవసరం శ్రీవాణి. ఈ తరంవారికి శ్రీవాణి గొప్ప పత్రిక "

—గన్నాబత్తుల సుబ్బారావు ( పెదతాత), భీమవరం

" శ్రీవాణి పత్రిక ఎంతో ఉన్నతస్థాయికి చెందిన దనడంలో ఏమాత్రం సందేహం లేదు. వర్ధమాన సమాజంలో ఇలాంటి పత్రిక నడపడం సామాన్య విషయం కాదు. రిజర్వేషన్ల విషయంలో మీరు వెలిబుచ్చిన అభిప్రాయాలతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. ప్రతి పత్రికను ఆమూలాగ్రం చదివించుకొని వింటున్నాను. ( వీరికి రెండు కళ్లూ లేవు, అయినప్పటికీ పిహెచ్. డి చేసారు. )

డా॥ యం. సత్యనారాయణ, గుంటూరు

" శ్రీ సాయిబాబాగారి పరిచయం మీలో ఎంతో మార్పును తీసుకొనివచ్చింది. బాబాగారి సందేశములు చదువరులను ఎంతో ప్రభావితం చేస్తున్నాయి. బాబాగారి నుండి వెండి బంగారముల వంటి వస్తువులు గాకుండా, పవిత్రమైన సాలగ్రాముసు పొందిన మీ అదృష్టమేమని చెప్పాలి. "

—యస్. వి. రామారావు, ముస్తాబాద

నవంబరు - 1986

సంపుటి : 2

సంచిక : 11


# శ్రీవాణి


సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు-కొమరగిరి కృష్ణమోహనరావు



మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-51 రామానాయుడుపేట

మచిలీపట్నం-521 001

ఫోన్ : 2818


చందా వివరాలు

| | |
|---|---|
| విడిప్రతి : | రు. 3-00 |
| సంవత్సర చందా : | రు. 33-00 |
| 2 సం॥ల చందా : | రు. 60-00 |
| 4 సం॥ల చందా : | రు. 116-00 |
| జీవిత సభ్యత్వం : | రు. 500-00 |


EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at

SPANDANA PRINTERS
MACHILIPATNAM


## విషయసూచిక



ముఖచిత్రం

జవహర్‌లాల్ నెహ్రూ

శ్లో॥ సహసా విదధీత నక్రియాం
అవివేకః పరమాపదాం పదం
వృణతేహి విమృశ్యకారిణం
గుణలుబ్ధాః స్వయమేవ సంపదః ॥

ప్రపంచంలో ప్రాణికోటి కంతటికి ఆకలి మొదలయిన లక్షణాలు సమానమైనా కొన్ని జీవుల్లో కొన్ని విశిష్ట లక్షణాలు కనబడతాయి. ఆ లక్షణాలవల్లనే ఒక జాతికంటె మరో జాతి ప్రత్యేకతను సంతరించు కొంటుంది. అలాంటి విశిష్టతను సంపాదించుకొన్న జాతి మానవజాతి.




మానవుడు బుద్ధిజీవి కావటం చేతనే ఆ వైలక్షణ్యం యేర్పడిందని చెప్పాలి. అంతఃకరణ చతుష్టయంలో బుద్ధి యొక్క స్థితి గొప్పది. బుద్ధితత్త్వమే వేరు. మనస్సు మొదలయినవి చేయలేని నిర్ణయాన్ని బుద్ధిచేయగలుగుతుంది. కనుకనే మనం ఎలాంటి జపతపాలు చేసినా యీ బుద్ధి ప్రచోదనం బాగా జరగటానికే.

సాధారణంగా నిర్మలమైన బుద్ధికి నిజమే గోచరిస్తుంది. అందుకని బుద్ధినెప్పుడు నిర్మలంగా చేసికొనేందుకు ప్రయత్నించాలి. బుద్ధిలో నిశ్చయజ్ఞానం కలుగుతుంది. ఇంద్రియాలకు దాసులు కానివారికి బుద్ధి వికసిస్తుంది, నిర్మలమౌతుంది. ఆ బుద్ధిలో గోచరించే ప్రతిది విశిష్టంగా భాసిస్తుంది. మంచిచెడులు ఆ బుద్ధికి స్పష్టంగా తెలుస్తాయి.

మంచిచెడులను తెలుసుకొనే తెలివి వివేక మనిపించు కొంటుంది. వివేకం వల్ల కర్తవ్యమేదో పరిహార్యమేదో తెలుసుకో గల జ్ఞాన మేర్పడుతుందన్నమాట. వివేకం ఆ జీవి సంస్కారబలం వల్ల యేర్పడుతుంది. ఇండువ గింజ చాది గంధాన్ని ఒండ్రు నీటిలో కలిపితే ఒండ్రు మట్టి క్రిందికి దిగి నీరు తేటబారినట్లుగా వివేకం వల్ల బుద్ధిలో నైర్మల్యం, నిశ్చలత్వం యేర్పడుతుంది. అప్పుడుచేసే ప్రతి ఆలోచన ఫలోన్ముఖమవుతుంది.

అందుచేత మనం ఏ పని చేసినా ముందు చక్కగా బుద్ధితో ఆలోచనచేసి ప్రవర్తిస్తే ఆ పని సత్ఫలితాన్నిస్తుంది. ఆలోచనలేకుండా తొందరబడి యేపనీ చేయకూడదు. తొందరపడి చేసిన యే పనీ రాణించదు. వివేకవంతు డెవడూ అనాలోచితంగా ఏ పనీ తొందరపడి ప్రారంభించడు. తొందరపడి పనిచేయటమనేది అవివేక లక్షణమే. అలాంటి అవివేకంవల్ల ఆపదలను కొని తెచ్చుకోటమే అవుతుంది. అవిమృశ్యకారిత్వంవల్ల అన్నీ ఆపదలే తటస్థ పడతాయి.

అందుకని విమర్శించుకొని యేపని చేసినా అది చక్కగా వుంటుంది. అలా ఆలోచనతో చేసే వ్యక్తి బుద్ధిమంతుడు, గుణవంతుడు. అలాంటివాడిని సర్వసంపదలు తమంతట తామే వరిస్తాయట.

ఈ భావం సార్వకాలికం, సార్వజనీనము. అందరూ గుర్తింపవలసిన విషయం. ప్రజలను పరిపాలించే ప్రభుత్వమూ గుర్తించాలి. అలాగే ప్రజలూ గుర్తించాలి. ఏదో వొకటి చేశామా లేదా అని చేయటం, దానివల్ల అనర్థాలేర్పడటం, తిరిగి దాన్ని దిద్దుకోటానికి ప్రయత్నించటం సరియైన పద్ధతికాదు. అడుసు తొక్కట మెందుకు ? కాలు కడుక్కోట మెందుకు ?



# సంపాదకీయం    జస్టిస్ చల్లా కొండయ్య కమీషన్

శ్రీ ఎన్. టి. ఆర్. వేషధారణ చూచి హిందూధర్మమును పునరుద్ధరించడానికి ఏతెంచిన మహనీయుడని హిందూధర్మ ఆరాధకులు భ్రమించారు. సెక్యులర్ స్టేట్‌లో ఒక ముఖ్యమంత్రి ధరించవలసిన వేషం కాదని నాస్తికులు విమర్శించారు. పీడిత దళిత ప్రజల సముద్ధరణకు ఏతెంచిన సర్వసంగ పరిత్యాగినని శ్రీ ఎన్. టి. ఆర్. సగర్వంగా చెప్పుకున్నారు. ' మానవసేవే మాధవసేవ ' అని చెప్పి తిరుపతి దేవస్థానం డబ్బును కొంత ప్రభుత్వ ట్రెజరీకి తరలించారు. ఇప్పుడు చల్లా కొండయ్య కమీషన్ చేసిన 276 సిఫార్సులలో 236 సిఫార్సులను యథాతథంగా ఆమోదిస్తూ మిగిలిన 40 సిఫార్సులను స్వల్ప సవరణలతో ఆమోదించి సంక్షోభాన్ని సృష్టించారు. అనువంశికరణ హక్కులను రద్దు చేయాలని, దేవాలయముల భూములను వేలం వేసి, ఆ డబ్బును ప్రభుత్వ ఖజానాలో డిపాజిట్ చేయాలని నిర్ణయించారు. కొండయ్య కమీషన్ సిఫార్సులను అమలు పరుస్తే తీవ్ర పరిణామాలు తప్పవని, వేద మంత్రాలను వక్రీకరించి, తప్పుడు నిర్వచనాలనిచ్చి, అసందర్భ వ్యాఖ్యలను కమీషన్ చేసిందని శ్రీ వైష్ణవ పీఠాధిపతి శ్రీ త్రిదండి జియ్యర్ స్వామివారు పేర్కొన్నారు. ఇంకా అనేకమంది హిందూధర్మ ఆరాధకులు ఈ కమీషన్ సూచనలను తిరస్కరిస్తున్నారు. దీర్ఘ కాలంగా సాగుచేస్తున్న రైతులు నష్టపోతారని, కౌలుదారీ చట్టమును ఈ భూములకుకూడా వర్తింప జేయాలని దేవాలయ వ్యవస్థమీద ఏమాత్రం నమ్మకం లేని కమ్యూనిష్టు అభిమానులు ప్రభుత్వానికి సూచనలు చేస్తున్నారు.

ఈ విషయంలో ప్రభుత్వం పూర్వాపరాలను సమగ్రంగా పరిశీలించకుండా, హిందూ ధర్మ పీఠాదిపతుల అభిప్రాయములను తెలుసుకొనకుండా, ఏకపక్షంగా వ్యవహరించినట్లు కనబడుతున్నది. ఇదే విధమైన నిర్ణయం ఇతర మతస్థుల ఆరాధనాలయాల విషయంలో ప్రభుత్వం గైకొని ఉండి ఉంటే ఈపాటికే గందరగోళం ఏర్పడి ఉండేది. సహజంగా హిందువులు శాంతిప్రియులు, అహింసా వాదులు కావడం వలన పరిస్థితులను ప్రశాంతంగా పరికిస్తున్నారు. ప్రభుత్వం దీనిని ఆసరాగా గైకొని ఏకపక్షంగా ఈ కమీషన్ నిర్ణయాలను అమలు పరచ ప్రయత్నించితే అనేక తీవ్ర పరిణామాలను ఎదుర్కొనవలసి వస్తుంది.

అసలు స్థిరాస్తులను ఎవరు యిచ్చారు ? వారి పరమావధి ఏమిటి ? వాటిని వేలం వేయడం ఎంతవరకు సబబు ? నగదు రూపంలో ఎంతకాలం ఉంటుంది ? అది అయిపోయిన తరువాత దేవాలయముల నిర్వహణ బాధ్యత ఎవరిది ? అసలు ప్రభుత్వానికి ఎంతవరకు హక్కు ఉన్నది ? నాస్తికుల అభిప్రాయములను ఈ విషయంలో పాటించవచ్చునా ? వంశపారంపర్య హక్కు ఎందుకు ఏర్పడింది ? అర్చకులను ఉద్యోగులుగా పరిగణిస్తే వచ్చే ప్రమాదాలు ఏమిటి ? భక్తి ప్రధానమా ? వృత్తి ప్రధానమా ? మంత్రాలు వల్లె వేయడమే ప్రధానమా ? లేక ధార్మికదృష్టి ప్రధానమా ? అర్చకులను ఉద్యోగులుగా భావిస్తే, ఉద్యోగుల నియమ నిబంధనలను, స్కేళ్ళను, ఇంక్రిమెంట్లను అమలు చేయవలసిన పరిస్థితి ఏర్పడదా ? ట్రేడ్ యూనియన్ హక్కులను పొంది ఉద్యమాలు జరగవా ? అప్పుడు ఈ డబ్బు సరిపోతుందా ? పవిత్రములైన ఆరాధనాలయాలు ఉద్యమాలకు ఆలవాలం కావా ? ఈ విషయాలను సమగ్రంగా పరిశీలించకుండా తొందరపడి నిర్ణయాలను గైకొంటే ఆలయాల పవిత్రత పోయి, ఆలయాల నిర్వహణకోసం స్థిరాస్తులనిచ్చి వెళ్ళిపోయిన వారి ఆత్మలు సంక్షోభించవా ? ఈ విషయాలను గురించి సమగ్రమైన చర్చ జరిపి సముచితమైన నిర్ణయాలను గైకొనుటకు పీఠాదిపతులు, పండితులు, న్యాయాధీశులతో ఒక " ధార్మిక మండలి " ఏర్పర్చడం సముచితం. అంతవరకు ఈ విషయంలో తొందరపడటం విజ్ఞత మాత్రం కాదు.



# రంజనిమాల

సంకలనం
డా॥ వి. ఫణీంద్రుడు

ఈ రంజనిమాలలో వాడిన పదములు / వాక్యములు చలనచిత్ర ప్రసిద్ధ మధుర గీతముల నుండి తీయబడినవి. ఈ దిగువ నీయబడిన ఆధారములతో రంజనిమాలని పూరించండి.



**అడ్డం :**

1. " పాటలా ధరరాగ భావనలు కన్నాను.... ఎదలోవి తుమ్మెద పాట విన్నాను "
7. " .... కలువరావే హాయి హాయిగా "
8. " ....లా చెలి కన్నులలో బిత్తర చూపులు "
11. " నవ వసంత గానముతో నీవు నటన .... "
12. " ఆ కనులు పండు వెన్నెల .... "
13. " మోము చూపించవా గోపాల "
14. " ....నిన్నే రమ్మని పిలువ చేరరావేల "
16. " .... తీగె లాగ నిన్ను చేరుకున్నాను "
17. " నా అలివేణి .... వాల్చిరాగ "
20. " .... అనురాగమయి రావే "
22. " .... చెలియా, కనులా "
24. " ఎవరూ లేనిచోట ఇదిగో .... "
25. " గల గల సెలయేరులలో .... లు రేగగా "
26. " తావి లేక .... లే "
28. " చెలికాని .... నాటి భావాలు తెలుసుకోవాలని "

**నిలువు :**

1. " .... ఏవో తెలియని భావాలు రేపు "
2. " ఎదురు చూసే .... "
3. " .... రాజీకి "
4. " .... బాలా, లోకము చిత్రము చాలా "
5. " .... అమ్మాయి, నీ పోజుల్లో "
6. " .... కలసిన శుభవేళ "
9. " మిసిమి వయసు .... కొసరి విన్నానులే "
10. " .... పోసీ పొమ్మంటే "
15. " .... షికారుకెళ్ళే పాల బుగ్గల "
19. " రాగాల .... "
21. " .... కానిది విలువైనది "
23. " మరులు మనసులో స్థిరపడితే అప్తై జరిగేది "
27. " నీ నల్లని .... వెలసీ "
29. " .... కన్నుల నీడలలోన "

## చిత్రాల పేర్లు

**అడ్డం :** 1. ఏకవీర 7. అప్పుచేసి పప్పుకూడు 8. ఆత్మబలం 11. శ్రీకృష్ణార్జునయుద్ధం 12. తూర్పు పడమర 13. అమరశిల్పి జక్కన 14. కులగోత్రాలు 16. పూలరంగడు 17. పుణ్యవతి 20. జయభేరి 22 విప్రనారాయణ 24. మంచి కుటుంబం 25. శ్రీకృష్ణార్జునయుద్ధం 26. మంచిమనసులు 28. మూగమనసులు.

**నిలువు :** 1. నర్తనశాల 2. ఆనందనిలయం 3. ఇద్దరు మిత్రులు 4. బాటసారి 5. ఆత్మబలం 6 మాయాబజార్ 9. బందిపోటు దొంగలు 10. మంచీ చెడూ 15. తోడికోడళ్ళు 19. శాంతినివాసం 21. వెలుగు నీడలు 23. సుమంగళి 27. మంచీ-చెడూ 29 గుడిగంటలు.

# దీపావళి

## నరక చతుర్దశి

ఆదివరాహమూర్తికి, భూదేవికి పుట్టినవాడు నరకుడు. గర్భధారణ సమయ దోషమువలన రాక్షస ప్రవృత్తి కలిగిన వాడైనాడు- గిరి శస్త్ర సలిల దహన పవన- దుర్గములతో మురాశరపాశములతో పరివృతమైన ప్రాగ్జ్యోతిషపురమున నున్నాడు (ప్రాక్ జ్యోతిషము. పూర్వము జ్యోతిస్సుండెడిది.) ఇంద్రాదులను హింసించినాడు- 16000 రాజకన్యకలను బలాత్కారముగ తెచ్చి నిర్బంధించినాడు- ధర్మగ్లాని కలిగినది. శ్రీకృష్ణుడు సత్యభామా సహితముగ వచ్చి నరకుని దుర్గములను కూల్చినాడు. విద్యుల్లతవలెనున్న సత్యభామ విల్లు నంబులు ధరించి, శక్తిస్వరూపిణియై నరక సేనను నాశనముచేసినది. "శ్రీకృష్ణుడు తన కుమారుడేయైన నరకుని సంహరించినాడు- భూమ్యంశ సంజాతయైన సత్యభామా సమక్షముననే నరక సంహారము జరిగినది. భూమాత ఆగ్రహింపలేదు. శ్రీకృష్ణునకు కానుకలిచ్చి స్తుతించినది. ఈ నరక సంహారమును సూచించునదియే నరక చతుర్దశి. లోక కంటకుడైనపుడు పుత్రుడైనను వధ్యుడే అని తెలియుచున్నది. బలిచక్రవర్తి పాతాళమునకు వెళ్ళిన దినము కూడ నిదియే ననియు నొక ప్రసిద్ధి కలదు.

## దీపావళి అమావాశ్య

శ్రీరాముడు, అరణ్యవాసమును పూర్తిచేసికొని అయోధ్యలో పట్టాభిషిక్తుడైన దీనాడే అందురు. విక్రమార్కుని పట్టాభిషేక దినముకూడ నిదియే యనియు నొక యభిప్రాయమున్నది. ఆదర్శ పురుషుడై, ధర్మరక్షకుడైన శ్రీరాముని యందలి భక్తిని సూచించుటకే, ఈ దీపావళి యుత్సవము అని విశ్వాసము. బలి చక్రవర్తి సంవత్సరమున కొకసారి, ఈ దినములలో, ఇటకు వచ్చుననియు నందురు. ఇవి కంఠాశములకు సంబంధించిన విషయములు.

గిరి దుర్గాదులు పంచభూతాత్మకములైన అయిదు కోశములు. శ్రీకృష్ణుడు సంహరించిన ఏడ్గురు సేనానులు సప్తావరణములు. నరకుడు- అజ్ఞానము- ప్రాగ్జ్యోతిషపురము- శరీరము- సత్య-భామ. చిచ్ఛక్తి- క్రియాశక్తి- ఇచ్ఛాశక్తి రూప- శక్తివిశిష్టుడు- ప్రజ్ఞానఘనుడు శ్రీకృష్ణ పరమాత్మ-నరక- సంహారము అజ్ఞాన నాశనమే.

భాగవతుల కుటుంబరావు

16000 రాజకన్యలు- షోడక కళాంశములే, నాడీ రూపములు కూడను. వానినే శ్రీకృష్ణుడు గ్రహించినాడు. లోకమునకు అజ్ఞాన విముక్తి కలిగినది. " నాశయామ్యాత్మ భావస్థో జ్ఞాన దీపేన భాస్వతా " అను గీతా వచనము " అధర్మస్య నాశోస్తు, ధర్మస్య విజయోస్తు " అను ఆశలు ఫలించినవి- దైవీ సంపద ఆసురీ సంపదను గెలిచినది- ఇది ఆధ్యాత్మిక సందేశము.

కాలము దైవస్వరూపము .. ఒక్కొక్క కాలమున ఒక శక్తి విజృంభించును. ఆశ్వయుజ త్రయోదశి మొదలు కొని కార్తిక విదియవఱకు గల అయిదు దినములను - లేదా చతుర్దశి ఆమావాస్య పాడ్యమి అను మూడు దినముల నైనను దీపావళి దినములుగనే భావించుట సంప్రదాయజ్ఞుల యభిమతము. ఈ తిథులు, అలక్ష్మి - లక్ష్మిప్రవర్తకములగు ప్రాణదేవతలకు సంక్రమణ కాలము. వరుణుడు, నిఋతి, యముడు వీరి సంబంధవిశేషముండుటచే నీచతుర్దశి నరక చతుర్దశియైనది లక్ష్మి కుబేరుల సంబంధము గూడ నుండుటచే దీనినే ' రూప ' చతుర్దశి యనియు నందురు. అలక్ష్మి సహచరులు, వరుణయములు లక్ష్మికి సహచరులు ఇంద్రకుబేరులు- ఆశ్వయుజాన్తము వఱకు నున్న వరుణయమ ప్రాబల్యము, కార్తికపాడ్యమి నుండియు తగ్గును. ఇంద్రకుబేరుల ప్రాధాన్యము క్రమముగ పెరుగును. అలక్ష్మి నిర్గమనము, నిస్సరణము-

## దీపం వెలిగించు

సోదరీ ఈవేళ

మనిషిలో క్రౌర్యం పెరిగింది
స్వార్థం పెరిగింది
ద్వేషం పెరిగింది
కోపం పెరిగింది
పాపం పెరిగింది

దేశంలో అలజడి పెరిగింది
ఆందోళన పెరిగింది
హింస పెరిగింది
పీడన పెరిగింది

మనిషిలో సౌజన్యం పెరిగే
త్యాగం వెలిగే
స్నేహం పెంపొందే
శాంతం వికసించే
పావిత్ర్యం విలసిల్లే

దేశంలో ప్రశాంతత నెలకొనే
స్థిరత్వం పెంపొందే
అహింస రూపొందే
ఆత్మీయత వ్యాపించే
చైతన్య దీపం వెలిగించు
జాతిని వెలుగులోకి నడిపించు

ఈవేళ పాపం తొలగించే
దీపం వెలిగించు.

— తిరునగరి

లక్ష్మికి ఆహ్వానము ఆరాధనము పట్టాభిషేకము జరుగును ఇది వేదాగమ పరిభాషా రహస్యము-

స్వాతీ నక్షత్రమున్న సమయమున నరకచతుర్దశినాడు, అభ్యంగనస్నానము చేయవలయును- చేయుటకు ముందు, భూమిలో నుండి పీకిన ఉత్తరేణువును ఆ మట్టితో నున్న దానిని, తుమ్మికొమ్మను, జిల్లేడు కొమ్మను తన చుట్టు ముమ్మారైనను త్రిప్పు కొనవలెను. " నా పాపమును పరిహరింపుము " అని ప్రార్థింపవలెను-

అభ్యంగన స్నానము చేసి తిలకము ధరింపవలెను, యమతర్పణము చేయవలెను. లక్ష్మీపూజను, కుబేర పూజను ( ధనపూజ ) చేయవలెను. ఈ పండుగలలో ఇండ్లు కడుగుట, ముగ్గులతో నలంకరించుట, దీపములు వెలిగించుట, పూజ సేయుట, అభ్యంగనస్నానము - అలక్ష్మి నిస్సరణమునకు - లక్ష్మి ప్రతిష్ఠకు సూచకములు. రానున్న పంటల లక్ష్మిని, పైరు మహాలక్ష్మిని - కోరుచు అగ్రయణేష్టి అను క్రతువును ఈ అమావాస్యనాడు చేయుటయు గలదు. " కేదార గౌరి " పదము గమనార్హము. అర్థరాత్రి సమయమున లక్ష్మీపూజ సేయవలయును. ద్వారములు వేసికొనగూడదు అనుట సంప్రదాయ విదుల సమయము. దీపములను వెలిగించి ద్వారములు తెరిచి యున్నచో లక్ష్మి మన యిండ్లలో ప్రవేశించునని విశ్వాసము.

దీపావళి అమావాస్యకు భూలోకమునకు వచ్చిన పితృదేవతలు అమావాస్యనాడు తిరిగి వెళ్ళుదురు. వారికి మార్గ దర్శకముగా ఉల్కాదానము - దీపదానము సేయవలయుననుట ధర్మశాస్త్ర వాక్యము " తైలే లక్ష్మీః జలే గంగా దీపావళి దినే వసేత్ " అను వాక్యము ననుసరించి దీపావళినాడు తైలమునందు లక్ష్మి నివసించును. అగ్నిలోపడి చనిపోయిన, అగ్ని సంస్కారము జరుగనిజీవులకు మనమిచ్చు ఉల్కాదానము, దీపదానములు ఉత్తమ లోకములను కల్పించునని, మన మహర్షుల దర్శనము, ఘూర్జరుల సంవత్సరాదియు, ధనలక్ష్మి పూజయు నీదినములలోనే జరుగును.

## దీపము

పరంజ్యోతి స్వరూపమునకు ప్రతీకము - " ఉద్దీప్యస్వ జాతవేదః అపఘ్నన్ నిరుఋతిం మమ " - నా పాప

మును పోగొట్టు దీపమును వెలిగించుము. అగ్నిదేవా! అని ప్రార్థన. దీపము పరబ్రహ్మ స్వరూపము. ఆ పరబ్రహ్మయే నేను "జ్యోతిరహం విరజో విపాప్మా" అను భావన శ్రేయోదాయకము. అగ్ని చంద్రాదిత్య తేజస్సులకు మూలమైనది - పరంబ్రహ్మజ్యోతి. ఆ తేజస్సే కేనోపనిషత్తునందు ఉమా హైమవతిగా దేవతలకు దర్శనమిచ్చినది. ఆ తేజోరూపమైన దీపమునే మనము ఈ పండుగలలో ఆరాధించుచున్నాము. శ్రీ చక్రరూపమున సేవించుచున్నాము.

ఈ దీపావళి భారతదేశమునందే కాదు ఇతర దేశములలో గూడ, రకరకములుగా ఆచరణలో నున్నదనుట గుర్తింపవలసిన విషయము.

"తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతం గమయ" ★

# ప్రపంచ వింతలు

ప్రపంచంలో మానవ నిర్మిత మహా నిర్మాణములలో ఏడింటిని మాత్రం ప్రపంచ వింతలుగా పేర్కొంటున్నారు.

1. ఈజిప్టులోని పిరమిడ్లు (The Pyramids of Egypt) : ఇవి ఈజిప్టులోని రాజుల సమాధులు. పూర్వం ఈజిప్టులోని రాజులను "ఫారోస్" అనేవారు. 70 మంది ఫారోస్‌లకు పిరమిడ్లు నిర్మించబడినవి. 1200 సంవత్సరాల ఈజిప్టుదేశ చరిత్రను ఇవి ప్రతిబింబిస్తున్నవి. పిరమిడ్లు అన్నింటిలో నిచియోప్స్ పెద్దది. ఒక్కొక్కటి 2 1/2 టన్నుల బరువుగల 2 లక్షల రాళ్ళతో నిర్మించబడినది.

2 వ్రేలాడే తోటలు (The Hanging Gardens of Bobylon) : బాబిలోనియాలోని యూఫ్రెటిస్ నదీసమీపంలో ఇవి నిర్మించబడినవి. భూమికి 70 నుండి 300 అడుగుల ఎత్తులో లతలు, తరువులు మొదలగునవి పెంచబడినవి. ఎత్తయిన రిజర్వాయర్ల ద్వారావీటికి నీటి సరఫరా చేయబడుతూ వుండేది. ఇవి క్రీ. పూ. 600 సం. నాటివి.

3. అర్టిమిస్ దేవాలయం ( The Temple of Artemis ) (Diana) : ఎఫిసస్ అనే పురాతన పట్టణంలో 'డయానా' అనే దేవత స్మృతి చిహ్నంగా నిర్మించబడిన దేవాలయం ఇది. 425 × 225 అడుగుల కొలతలతో చలువరాతితో నిర్మించబడినది. ఒక్కొక్కటి 150 టన్నుల బరువు 60 అ. ఎత్తు గల 127 స్తంభములు ఉపయోగించబడినవి. 'హీరోస్ట్రాటస్' అనే నిరంకుశ పాలకుడు ఈ దేవాలయాన్ని దగ్ధం చేశాడు.

4. మాసోలస్ సమాధి (The Tomb of Mausolus) క్రీ. పూ. 352 లో ఆర్టిమీసియా అను రాణి కారియా స్మృతి చిహ్నంగా చలువరాతితో నిర్మించింది. భూకంపం మూలంగా యిది నశించింది.

5. రోడ్స్‌లోని కొలాసస్ (Colossus of Rhodes): ఇది గ్రీకుల సూర్యదేవుడైన హెలియస్ కంచు విగ్రహము. దీని ఎత్తు 109 అడుగులు. క్రీ పూ 280 లో దీని నిర్మాణము పూర్తి అయినది. ఇది క్రీ. పూ. 224 లో భూకంపం వలన శిథిలమైనది. క్రీ. శ. 672 లో తురుష్కులు స్వాధీన పరచుకొని దీనిని అమ్మివేశారు.

6. జూపిటర్ విగ్రహము (The Statue of Zeus (Jupiter) : ఒలంపియాలో ప్రతిష్ఠించబడిన విగ్రహం. క్రీ. పూ. 432 లో ఫిడియాస్ అనే శిల్పి దీన్ని నిర్మించాడు. చలువరాయి, దంతం, బంగారుపూతతో నిర్మించబడిన అత్యద్భుతశిల్పం ఇది.

7. అలెగ్జాండ్రియాలోని లైట్‌హౌస్ (The Pharos of Alexandria) : క్రీ. పూ. 265 - 247 లో టోలమీ ఫిలడెల్ఫస్ అనే రాజు దీని నిర్మాణాన్ని పూర్తిగావించాడు. దీని ఎత్తు 600 అడుగులు. ★

# ఆదర్శ పురుషుడు, నవభారత నిర్మాత

# జవహర్‌లాల్ నెహ్రూ

'దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుజులోయి' అన్నాడు మహాకవి గురజాడ అప్పారావుగారు. ఒక దేశము యొక్క ఔన్నత్యము ఆ దేశములోని ప్రజల మీదనే ఆధారపడి యుంటుంది. ఒక విధముగా చూస్తే దేశములోని మహా పురుషుల చరిత్రయే ఆ దేశ చరిత్రగా భాసిస్తుంది. ఆధునిక భారతదేశ చరిత్రను, ప్రధానంగా రాజకీయాల దృష్టిలో తీసుకొంటే, మహాత్మా గాంధి మొదలగు నాయకుల చరిత్రయే భారతదేశ చరిత్ర యని చెప్పవలసి యుంటుంది. స్వరాజ్యము సిద్ధించిన తర్వాత రాజకీయ పురోగతికి పండిత జవహర్‌లాల్ నెహ్రూ, సర్దార్‌వల్లభాయిపటేల్ వంటి నాయకుల చరిత్రయే ఆధారము. 562 స్వదేశ సంస్థానములను రక్తపాతము లేకుండా భారతదేశములో లీనముచేసి భారత దేశము యొక్క ఏకత్వమును, సమగ్రతను పరిరక్షించిన రాజకీయ ధురంధరుడు సర్దార్‌వల్లభాయిపటేల్. అటులనే ఆర్థిక పరమైనట్టియు ప్రజాస్వామిక పరమైనట్టియు దేశ వికాసమునకు ప్రధాన కారణభూతుడు, పండిత జవహర్‌లాల్ నెహ్రూ.

**కాశీనాథుని పూర్ణమల్లికార్జునుడు**

ఆయన కుటుంబమే త్యాగనిరతికి ప్రతీక. ఆయన తండ్రి పండిత మోతీలాల్ నెహ్రూ. తల్లి స్వరూపరాణి. మోతీలాల్ నెహ్రూ అలహాబాద్ హైకోర్టులో ప్రముఖ న్యాయవాది. ఆరోజులలోనే నెలకు ముప్పది వేలకు పైగా సంపాదించేవాడు.... భోగి. అయినను గాంధీమహాత్ముని పిలుపు మేరకు. అపార ధనార్జనకు మూలమైన న్యాయవాద వృత్తిని, తృణప్రాయముగా విసర్జించి, మహాత్ముని సహచరుడు, అనుచరుడు అయినాడు.

భోగి, త్యాగిగా మారినాడు. అత్యంత సుఖములు అనుభవించినవాడు అనేక దుర్భర కష్టములకు గురియైనాడు. ఆరోగ్యమును లెక్కచేయక కారాగారవాసమును అనుభవించి ఆరోగ్యమును కోల్పోయినాడు. తనయొక్క విశాల సుందర భవనమగు స్వరాజ్య భవనమును కాంగ్రెసునకు వితరణగా యిచ్చినాడు. ఆయన గర్భవాసమున జన్మించిన జవహర్‌లాల్ తండ్రిని మించిన తనయుడు అయినాడు. మన సంప్రదాయములో "పుత్రాదిచ్ఛేత్ పరాజయం" అను సూక్తి గలదు. అనగా మంచి తండ్రి తన కుమారుడు తనను మించిన వాడు కావలయునని కోరుకొనునట. ఆవిధంగా జరిగినది. తండ్రిగారు న్యాయవాద వృత్తిని విసర్జించకయే, తన ఆదాయమును అంతను కాంగ్రెసునకు అర్పించుచు సేవచేస్తే బాగుంటుందని తలచినట్లును, కాని కుమారుడు ఆయనకు నచ్చ జెప్పి, వృత్తిని మాన్పించినట్లున్నూ ఆ రోజులలో చెప్పుకునే వారు. జవహర్‌లాల్ కూడా న్యాయవాద వృత్తినే చేపట్టుటము జరిగింది. కాని, ఆయన దేశభక్తి దేశసేవా తృష్ణ ఆ వృత్తిలో కొనసాగనీయలేదు. న్యాయవాద వృత్తిని వదిలివేసి గాంధీ మహాత్ముని ప్రధాన అనుయాయులలో ఒకడైనాడు. భార్యతో కూడ కారాగారవాసము అనుభవించినాడు. అతికోమల శరీరియైన ఆయన భార్య కమలా నెహ్రూ అనారోగ్యమునకు గురియై అకాల మరణము నందుట జరిగినది. వారి కుటుంబమువారు, దేశసేవాహుతాశనునకు ఆహుతియైనారు. సింహమునకు పుట్టిన పిల్ల సింహము కాక వేఱగునా ?

శ్రీవాణి

త్యాగశీలత్వము, మేధావిత్వము, పాండిత్యము, నేతృత్వము, కార్యదక్షత్వము, సౌమ్యత్వము, నిర్విరామ కృషి కర్తృత్వము, రచనా సామర్థ్యము, వినయ శీలత్వము, దేశభక్తి మొదలగు సద్గుణములెన్నో రాశీభూతమై ఆయనలో మూర్తీభవించినవి. అంత సంపన్న కుటుంబములో జన్మించినను, దేశసౌభాగ్యము కొఱకు కష్ట పరంపరలను ఇచ్ఛితముగా అనుభవించుట ఆయన త్యాగ శీలత్వమునకు, దేశభక్తికి నిదర్శనము. ఆయన రచించిన గ్రంథములు ఆయన మేధావిత్వమునకు, పాండిత్యమునకు, రచనా నైపుణ్యమునకు ఆదర్శములవంటివి. గాంధీమహాత్ముని నిర్యాణానంతరము అఖిల భారత కాంగ్రెసు సంస్థను, స్వతంత్రభారతమును నడిపించుట ఆయన కార్య దక్షతకు నేతృత్వ నిర్విరామ కృషికి సాక్ష్యము. గాంధీ మహాత్మునితో కొన్ని ముఖ్య విషయములపై అభిప్రాయ భేదమున్నను అయన మాటకు తిరుగు చెప్పలేదు. ఆయన వాక్యమునే పరిపాలించినాడు. 1942 సం॥ లో "క్విట్ ఇండియా" ఉద్యమమును గాంధిమహాత్ముడు సంకల్పించినప్పుడు భేదాభిప్రాయమును వర్కింగు కమిటీ సమావేశములో వెలిబుచ్చియు, తన నాయకుని, అతి విధేయతతో అనుసరించినాడు. గాంధిగారి ఆజ్ఞలను ఎన్నడూ ఆయన ఉల్లంఘించలేదు. తనకు తాను గొప్పనాయకుడు అయి ఉండియు, తన నాయకుని అతి వినయముతోను భక్తితోను అనుసరించుట మహాపురుష లక్షణము.

భారతదేశ పురోగతికి, దేశ సౌభాగ్యమునకు ఆయన చేసిన సేవ అపారము. రాజ్యాంగ నిర్మాణ సభా సమావేశములలో, రాజ్యాంగము యొక్క పూర్వపీఠిక (Preamble) తయారు చేయుటలో ఆయన పాత్ర విశిష్టమైనది.... ఆయనకు ప్రజాస్వామ్య పద్ధతి యందు మిక్కిలి విశ్వాసము కలదు. అందువలన భారత రాజ్యాంగము ప్రజాస్వామ్య పద్ధతిమీద నుండవలయుననియు, యుక్త వయసు వచ్చిన వారందరికి వోటింగు హక్కు ఉండవలయుననియు ఆయన అభిప్రాయము. తదనుసారముగానే రాజ్యాంగమును నిర్మాణము చేయించినాడు.




1. ప్రపంచంలోకెల్లా బంగారం ఎక్కువగా దొరికే దేశమేది ?
2. WED అంటే ఏమిటి ?
3. ఫోటోగ్రఫీని కనుగొన్నదెవరు ?
4. బాల్‌పాయింట్ పెన్‌ను కనుగొన్నదెవరు ?
5. రోమన్ అంకెల్లో XM అంటే ఎంత ?
6. జూపిటర్ గ్రహానికి ఎన్ని ఉప గ్రహాలున్నాయి ?
7. వరంగల్ దగ్గర ఉన్న వెయ్యి స్థంభాల గుడి పొడవెంత ?
8. ఈస్టిండియా కంపెనీ మనదేశానికి ఏ సం॥లో వచ్చింది ?
9. ఎల్. పి రికార్డు మొదటగా ఎప్పుడు ప్రవేశ పెట్టబడింది ?
10. నాలుగు మోకాళ్ళు ఉన్న జంతువేది ?
11. కాంతి వేగాన్ని మొదటగా కొలిచిన వారెవరు ?
12. కామన్వెల్తులోని దేశాల సంఖ్య ఎంత ?
13. థాయ్‌లాండ్ దేశం యొక్క పూర్వపుపేరు ఏమిటి ?
14. 'ఐరన్ మాన్ ఆఫ్ ఇండియా' ఎవరు ?

1. South Africa (దక్షిణాఫ్రికా) 2. World Environmental Day 3. ఫాక్స్‌టాల్ బాట్ 4. లాండ్ జే బెయిరో 5. 10,000 6. 12 7. 1219 సం॥ 8. 1600 A.D 9. 1948 లో 10. ఏనుగు 11. రోమర్ 12. 48 13. సయాం 14. సర్దార్ వల్లభ భాయ్‌పటేల్

## బాలవాణి
### సోమంచి రామం

## పందెం

అందాల రెక్కలె నాకుంటే
అంబర వీధినె ఎగిరి
అందుకుంటా ! నిన్నందుకుంటా !
పందెం వేయి చందమామా ॥అం॥

సింగారంగ నింగి నుంచీ
తొంగి తొంగి చూచేసంటూ
పొంగి పొంగి పోదోయ్
చెంగున నీ దరి చేరంగ
హంగూలెన్నో కూర్చానోయ్ ॥అం॥

చల్లని వెన్నెల మాపై చల్లి
ఉల్లము లుప్పొంగించానంటూ
ఉల్లాస పడబోకోయ్
మెల్లగ నీ దరి చేరంగ
పల్లకి సరిచేశానోయ్ ... ॥అం॥

ఆరూ పోరులె లేకుండ
ఆకసమే యేలే నంటూ
అదిరీ పడబోకోయ్
పదిలంగ నీ పక్క చేర
అదను సమకూర్చానోయ్ అం॥

న్యాయము, స్వేచ్ఛ, సమానత్వము, సౌభ్రాతృత్వము అనే పునాదులతో రాజ్యాంగమును ఏర్పాటు చేయించినాడు. ఈ సూత్రములు పూర్వపీఠికలో పొందుపరుపబడినవి. ఈ సూత్రములకు అనుగుణముగనే రాజ్యాంగ నిర్మాణము జరిగినది. మన రాజ్యము సర్వ స్వతంత్రమైన ప్రజా సత్తాక రాజ్యముగా రూపొందించినాడు.

ఆయనకు సామాజిక వాదముపైన విశ్వాసముండుట చేత, సోషలిస్టు విధానములోని కొన్ని పద్ధతులను అవలంభించినాడు. అందులో ప్రధానమైనవి ప్రణాళికా బద్ధమైన ఆర్థిక పురోగతి. భారత దేశమువంటి పెద్ద దేశమునకు, విశాలమై అత్యధిక జనసంఖ్య గల దేశమునకు, పంచవర్ష ప్రణాళికలద్వారా మాత్రమే అర్థిక వికాసము జరుగగలదని ఆయనవిశ్వాసము. రష్యాదేశములో మొదటగా ప్రణాళికా నిర్మాణ పద్ధతి అవలంబింప బడినది. దానిననుసరించి పంచ వర్ష ప్రణాళికలను తయారు చేయుటకై, ప్రధానమంత్రి అధ్యక్షత క్రింద ఒక సంఘమును ఏర్పాటు చేసినాడు. కొన్ని లోపములు సంభవించినను ఈ పద్ధతి వలన మన దేశము ఆర్థికముగా పురోభివృద్ధి చెందిన దనుటలో ఎట్టి సంశయమున్నూ లేదు.

భారతదేశము ప్రధానముగా వ్యావసాయిక దేశమై యున్నందున, సౌభాగ్యవంతము కావలెనంటే పరిశ్రమాభి వృద్ధి జరుగవలెనని ఆయన సంకల్పము. అందులో భారీ పరిశ్రమలయెడ ఆయనకు నమ్మకము మెండు. అందువలన మౌలికములైన ఇనుము ఉక్కు, విద్యుచ్ఛక్తి, అణుశక్తి, మొదలగు పరిశ్రమలకు ప్రాధాన్య మిచ్చినాడు.

అన్నిటికంటే ముఖ్యమైన విషయము మన రాజ్యాంగమును లౌకిక ( Secular ) రాజ్యాంగముగా, ఏర్పాటు చేసినాడు. అది లేకున్న దేశములో పూర్తిగా అశాంతి స్థిర పడిపోయి ఉండెడిది. లౌకిక రాజ్యమనగా మత విషయముల యెడ ద్వేషభావముకాదు. ప్రభుత్వమునకు అన్ని మతముల యెడ సమాన గౌరవ భావము, ఏ యొక్క మతమునకు ప్రాధాన్యమివ్వకుండుట మాత్రమే.... అంతర్జాతీయ రంగములో కూడా ఆయన నిర్వహించిన పాత్ర ప్రశంసనీయమైనది. ప్రపంచ శాంతి సుహృద్భావములకు, పంచశీల అనే ఐదు సూత్రముల మీద అంతర్జాతీయ వ్యవస్థను నిర్మించుటకు ఆయన చేసిన కృషి గణనీయము.

భారత దేశమునకు మొట్టమొదటి ప్రధానమంత్రియై దేశ సౌభాగ్యమునకు స్థిరమైన పునాదులను నిర్మించి, యశః కాయముతో దేశప్రజలను విడిచి వెళ్ళిన జవహరులాల్, ధన్యజీవి, ఆదర్శ ప్రాయుడు, మార్గదర్శకుడు. ★



# చిత్తశుద్ధిగలవానికే భగవదనుగ్రహం లభిస్తుంది

" మృత్పిండ మేకం బహు భాండ రూపం
సువర్ణ మేకం బహు భూషణాని
గోక్షీర మేకం బహు దీన తాపం
ఏకం పరాత్మా బహు దేహవర్తి "

మట్టి ఒక్కటే, కాని కుండల రూపములు భిన్నములు. సువర్ణము ఒక్కటే, కాని ఆభరణములు వివిధములు. గోవుల రంగులు భిన్నములు, కాని గోవు క్షీరము పవిత్రము అనగా తెలుపు రంగు. ఆత్మ ఒక్కటే, అయితే మానవుల యందు భిన్నత్వమైన రూపములలో ప్రకటితమవుతున్నది.

" ఏకోదేవో సర్వ భూతేషు గూఢః " ప్రతి భూతమునందును అంతర్భూతముగా ప్రకటించేటటువంటి దేవుడు ఒక్కడే. అతడే సత్యస్వరూపుడు. అతనే అనంత ప్రభావుడు. కానీ సత్యం ఒక్కటైనప్పటికినీ అనుభవజ్ఞులు దానిని అనేకంగా అనుభవిస్తూ వచ్చారు.

" ఏకం సత్ విప్రా బహుధా వదన్తి " ఉన్న సత్యం ఒక్కటైనప్పటికినీ వారి వారి అనుభూతులను, వారి వారి అనుభవములను పురస్కరించుకొని భగవంతునికి అనేకవిధములైనటువంటి రూప నామములను కల్పించుతూ వచ్చారు. మూలాధారములను ఎవ్వరూ మార్చలేరు, లేక కూర్చలేరు. ఈనాడు భగవంతునియొక్క తత్వాన్ని అర్థం చేసుకొనలేనివారు అనేకులు. అర్థం చేసుకున్నట్టుగా అభినయం చేసేటటువంటివారు మరింత అధికులు. కాన దైవత్వమును ఎవ్వరునూ, ఏనాటికీ పరిపూర్ణముగా అర్థం చేసుకొనలేరు. మనస్సునకు గాని, వాక్కునకు గాని అతీతమైనటువంటి దివ్యత్వాన్ని, పవిత్రతను ఏరీతిగా వారు వర్ణించగలరు? ఏ రీతిగా వారు చిత్రించగలరు?

మానవులకు అవసరమైన వస్తువులనన్నింటినీ భగవంతుడు ఉచితంగా సృష్టిస్తూ వచ్చాడు. భగవంతుడు అనుగ్రహించి ప్రసాదించిన మట్టి, నిప్పు, నీరు, గాలి, సూర్య కాంతులనుండి వ్యక్తి, వైజ్ఞానికుడు అనేక విధములైనటువంటి రూప నామములను సృష్టించుతూ వస్తున్నాడు. కానీ ఈ వైజ్ఞానికుడు ఈ పదార్థములను సృష్టించినట్లుగా భ్రమిస్తున్నాడు. లేని పదార్థములను ఏ వ్యక్తి సృష్టించలేడు. ఉన్నదానికే కన్న రూపములను ఏర్పర్చి భిన్నమైన భిన్న మార్గములయందు ప్రబోధిస్తూ వస్తున్నాడు.

**శ్రీ సత్యసాయి బాబా**

నీరులో నిప్పున్నది. కాని వైజ్ఞానికుడు తన విజ్ఞానశక్తి చేత దానినుంచి విద్యుచ్ఛక్తిని ప్రసరింప జేయుచున్నాడు. ఈ విద్యుచ్ఛక్తి వైజ్ఞానికుడు సృష్టించినది కాదు. అగోచరమై, గుప్తముగా నున్న శక్తిని తాను వ్యక్తంచేస్తూ వచ్చాడు. ఈ నీరునందే ఈ విద్యుచ్ఛక్తి లేకుండిన తాను ఏమాత్రం దీనిని సృష్టించలేడు. వ్యక్తిని ఆధారముగా గైకొని వైజ్ఞానిక శాస్త్రం విరివిగా పెరుగుతున్నది. లేనటువంటిదానిని సృష్టించినట్లుగా భ్రమించటం మాత్రం అజ్ఞానం. భూమిలో అట్టడుగున జలమున్నది. వైజ్ఞానికుడు శాస్త్రి సాంకేతిక విజ్ఞానంతో దీనిని పైకి తెప్పిస్తున్నాడు. ఆసలు లేనిదానిని సృష్టించడం లేదు. ఉన్న మూల ధాతువును సంహారం చేయడం లేదు. నిర్మూలించడం గాని నిర్మాణం చేయడం గాని మానవుని చేతిలో లేదు. ఈ దివ్యత్వమును ప్రతి వ్యక్తి గుర్తించినప్పుడే దైవత్వమనేటటువంటిది సర్వత్రా వ్యాపించినదనే సత్యాన్ని అర్థం చేసుకోగలడు. మానవునిచేత ఇవి

కేవలం సృష్టించబడటమో, లేక దీనిని సంహరించడమో జరుగుతున్నదని మనం భావిస్తున్నాం - ఇది కేవలం మానవుల ఊహలు మాత్రమే.

భూమికి ఆకర్షణశక్తి సహజమైనటువంటిది. న్యూట్రన్ శాస్త్రజ్ఞుడు పరిశోధన చేసి దీనిని వెలుగులోనికి తెచ్చాడు. ఈ ఆకర్షణశక్తి భూమికి న్యూట్రన్ కనిపెట్టుటకు పూర్వమే భూమియందున్నది. అదే విధముగనే దైవశక్తి అనేటటువంటిది గుప్తముగా, గోప్యంగా సర్వత్రా ఉండినప్పటికినీ వారివారి సాధన సంపత్తిద్వారా దానిని సాక్షాత్కరించుకోగలుగుతున్నారు.

## గంగ దే కులం? గాలి దే కులం?

సత్యం ఒక్కటే. కాని ఇది బ్రాహ్మణుల సత్యం, క్షత్రియుల సత్యం, భారతీయుల సత్యం, అమెరికావారి సత్యమని- ఈ సత్యాన్ని ఒక కులమునకు, ఒక దేశమునకు పరిమితం చేయలేముగదా! అదే విధముగా నిప్పు, నీరు తత్వమును కూడాను. ఇది బ్రాహ్మణుల నిప్పు, శూద్రుల నిప్పు, భారతీయుల నిప్పు, విదేశీయుల నిప్పని దీనికి ఎట్టి భేదములూ లేవుగదా! "గంగదేకులం? గాలిదే కులం?" అందరం అనుభవిస్తున్నాము గదా! ఇట్టి విధముగనే దైవత్వ మనేటటువంటిది ఏకత్వమై ఉండినప్పటికినీ మనయొక్క భ్రాంతులచేత భిన్నత్వంగా విభజించి దానిని భ్రాంతితోనే అనుభవిస్తున్నాము. దైవత్వాన్ని జాతి మత దేశ కాలములకు ఏమాత్రం దీనిని పోల్చుకొనరాదు. కృష్ణుని విషయం చూడండి. కృష్ణుడు ఏ తెగకు చెందినవాడు? ఇది బ్రాహ్మణులకు కులదేవత కాదు. క్షత్రియులకు ఒక సంపదకాదు. వైశ్యులకు ఇది ఒక ఐశ్వర్యం కాదు. లోక సంరక్షణకై అవతరించినటువంటి ఒక స్వరూపం. కృష్ణుడు నావాడు, నీవాడు అనుకోవడం కేవలం ఒక విధమైన మమకారమే, అభిమానమే. కనుక దైవత్వం అందరివారు. ఏ ఒక్కటి వారు మాత్రంకాదు. ఉన్నది ఒక్కటే, ఒక్కడే దైవం. ఈ ఒక్కడైనటువంటి దైవము పెక్కు రూపములను పొంది అనేక విధములైనటువంటి భ్రాంతులను సంతృప్తి పరుస్తూ వస్తున్నాడు. ఇలాంటి దైవత్వాన్ని మనం అర్థం చేసుకొనవలెనంటె కేవలం సాధన మాత్రమే సరిపోదు. విచారము కూడను అత్యవసరం. ఈనాడు భిన్నత్వమును ప్రోత్సహించి అభివృద్ధి పరచే టటువంటివారు అధికమైపోతున్నారు. ఏకత్వమును అనేకత్వంగా భావిస్తూ వస్తున్నారు. కనుకనే దివ్యత్వమనేటటువంటిది అడుగున పడిపోతున్నది. దైవత్వముయొక్క నిజతత్వాన్ని గుర్తించలేక పోతున్నారు.

## అధర్మమును ప్రోత్సహిస్తున్నారు

ఏ దేశమున ధర్మదేవత, శాంతిదేవత కలకలలాడుచుండునో ఆదేశము నందే సంపత్తి కిలకిలలాడుతూ ఉంటుంది. ఈనాడు ధర్మమునకు విరుద్ధంగా, నీతికి విరుద్ధంగా నాతిని ఆధారంగా చేసుకొని అనేక విధములైన అశాంతిని అభివృద్ధి పరుస్తున్నారు. ఇలాంటి అధర్మమును అభివృద్ధి పరచేటటువంటి వ్యక్తులను పెద్దలు చూస్తున్నారు. విద్వాంసులు, పండితులు పరికిస్తున్నారు. ఉన్నతస్థాయిలో వున్న అధికారులు చూస్తున్నారు. ఎవ్వరూ దీనిని అరికట్టలేక పోతున్నారు. అధర్మమని తెలిసినప్పటికీ దీనిని ఎదుర్కొనలేక పోతున్నారు. కనీసం ప్రయత్నం కూడా చేయడంలేదు. ఇట్టివారు అధర్మమును ఆచరించక పోయినప్పటికీ, ప్రోత్సహించిన వారవుతున్నారు.

## మహాభారత ఉదంతం

మహాభారతమునందు యుద్ధ ప్రమాదమును ధర్మజుడు ముందుగానే గ్రహించి కృష్ణుడ్ని రాయభారానికి అంపాడు. నిండు సభలో కృష్ణుడు రాబోవు ప్రమాదాన్ని చక్కగా వర్ణించాడు. మహాజ్ఞానులైన భీష్మ ద్రోణ కృపాచార్యులు విని ఊరుకుంటారు. కౌరవుల చెంత చేరడం చేతనే, వారి సహవాస దోషముల చేతనే అన్నీ తెలిసిన వీరుకూడా దానిని ప్రోత్సహించే వ్యక్తులుగా తయారైనారు. అధర్మమును అక్రమమును గుర్తించిన విదురుడు మాత్రం కృష్ణ పరమాత్మయొక్క పవిత్రమైన సూక్తులను ఆచరించడం మంచిదని అనేక విధముల నచ్చచెప్పాడు. ప్రయోజనం లేక పోవడం వలన, దుష్టులు, దుర్మార్గుల చెంత ఉండటం

కంటే యాత్ర పోవడం మంచిదని విదురుడు ఆ రాజ్యమునే విసర్జించి పోయాడు. భీష్మ ద్రోణ కృపాచార్యులు మాత్రం ఆ దుష్టుల దగ్గరనే జీవిస్తూ వచ్చారు. అందరూ గొప్ప ఆచార్యులే. ధర్మా ధర్మములను గుర్తించినటువంటి వారే. నిత్యానిత్య విషయములను పరిశీలించినట్టివారే. ఆచరణలో లేని యీ జ్ఞానములన్నీ నిరుపయోగములై పోయినాయి. కనుకనే కౌరవులు ఏవిధంగా మరణించారో ఈ ఆచార్యులు కూడను అదే విధంగా మరణించారు. అక్రమములను ధిక్కరించి వాటిని సరిచేసే శక్తి సామర్థ్యములున్నప్పటికీ వాటిని ఎవరు సరిచేయుటకు ప్రయత్నించరో అట్టివారు దుష్టులతో సమానమేనని, దుర్మార్గుల యొక్క ఫలితాన్ని వీరు కూడను అనుభవించవలసి వస్తుందని మహాభారత యుద్ధం ఋజువు చేస్తున్నది. దుర్మార్గుల సాహచర్యమే దీనికి కారణం.

రాత్రివేళలయందు మనలను ఒకటో రెండో దోమలు కుడుతాయి. కొన్ని నల్లులు కరుస్తాయి. ఈ బాధను సహించలేక మందును స్ప్రే చేస్తాం. కుట్టినది కొన్ని దోమలైతే, కరిచింది కొన్ని నల్లులైనప్పటికీ అన్నీ చస్తాయి. కుట్టిన, కరచిన వాటినే చంపుతున్నామా ? అన్నింటినీ చంపుతున్నాం. అదే విధంగా దుష్టులు, దుర్మార్గుల చెంత మన జీవితాన్ని గడపడం చేతనూ, అక్రమాలను అరికట్టలేక పోవడం చేతనూ మనం కూడా ఆ ప్రమాదంలో భాగమై పోతున్నాం. అక్రమ, అన్యాయ, అనాచారములు జరుగుతున్న సమయము నందు దానిని ఆదరించి అరికట్టలేని వ్యక్తులను సయితం దుష్ట సంహారం చేస్తున్నాడు పరమాత్మ. దోషికి సరైన బోధ చేయకపోవడమే నీ దోషం. సమాజంలో జరుగుతున్న అక్రమ అన్యాయములను సాధ్యమైనంతవరకు ఎదుర్కొనే విషయంలో పాల్గొనినప్పుడు మాత్రమే ధర్మ సంస్థాపనకు తోడ్పడిన వారమవుతాము.

## విభీషణుని ఆదర్శం

రావణుడు చేస్తున్న అక్రమాలను చూచి విభీషణుడు సహించలేక పోయాడు. సోదరునికి అనేక విధముల బోధించాడు. నచ్చచెప్ప ప్రయత్నించాడు. మితిమీరి పోవడంతో అక్కడ ఉండుటకు ఇష్టంలేక ధర్మమూర్తి శ్రీరామచంద్రుని పాదములను పట్టాడు. దోషములను గావించినటువంటివాడు రావణుడు ఒక్కడే. కానీ దానిని ప్రోత్సహించిన రాక్షసులు సహితం శిక్షలు పుచ్చుకోక తప్పలేదు, మరణమూ తప్పలేదు. కనుక మన బంధువులు గాని, పుత్రులు గాని దోషములు ఆచరించినప్పుడు, వారికి సరైన శిక్షనిస్తూ, ఎదుర్కొంటూ, సరిదిద్దుటకు ప్రయత్నించినప్పుడే మనం దోష రహితులమవుతాం గాని, దోషములను ప్రోత్సహిస్తూ, వాటిని అనుసరిస్తూ వచ్చిన వారు కూడా పరమ దోషులే అవుతారు.

## ఏకత్వం

పూర్వకాలమందు దుర్యోధనుడు దుర్యోధనునిగా, శకుని శకునిగా, ధర్మజుడు ధర్మరాజుగా ప్రవర్తించేవారు. కాని ఈనాడు ధర్మరాజు దుర్యోధనునిగా ప్రవర్తిస్తున్నాడు. పేరు ధర్మజుడు, వారియొక్క వినయవిధేయతలు, చూస్తే చాలా ధర్మంగా కనిపిస్తాయి. అహంభావములు

### మాజీ ముఖ్యమంత్రి

## అంజయ్య నిర్యాణం

అధికారంలో వున్నా లేకపోయినా ప్రజల అభిమానాన్ని, ప్రతిపక్షాల అభిమానాన్ని విశేషంగా చూరగొని; "ఆరణాల కూలీ" నుండి "ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి" స్థాయివరకూ ఎదిగిన ప్రజల మనిషి శ్రీ టంగుటూరి అంజయ్య ది. 18-10-86న న్యూఢిల్లీలో పరమపదించినారు. ఆయన మృతికి "శ్రీవాణి" తన సంతాపాన్ని ప్రకటిస్తోంది.

— ఎడిటర్

# చదవాలీ - ఎదగాలి

అమ్మ : చదవాలీ పాపా
ఎదగాలీ బాబూ
చదవాలీ మంచి చదువుల
ఎదగాలీ మనుషులుగ

పిల్లలు : చదివేశాం అమ్మా
వ్రాసేశాం అమ్మా

అమ్మ : అక్షరాలు నేరిస్తే చాలదు
అణకువ ఉండాలి
పాఠాలొస్తే చాలునా
ఆ అర్థం తెలియాలి ॥చద॥

అమ్మ : ఎవరడిగారని ఈ వెలుగు
ఇలా పంచుతాడూ సూర్యుడు ?
ఏమిచ్చామని వెన్నెలలు
ఇలా ఒంచుతాడూ చంద్రుడు ?

పిల్లలు : నాన్న మాకు సూరీడు
అమ్మ చందమామ
చిన్నపిల్లలము చుక్కలము
చక్కని కొండే మా ఇల్లు ॥చది॥

అమ్మ : నీవు నాటినా లేకున్నా
నీడ నిచ్చు చెట్టు
మంచి వారనీ ఎంచి చూడదు
అందరికీ పంచు సమంగా

పిల్లలు : పెద్దచెట్టు మా పాఠశాల
చల్లని నీడే మాష్టారూ
చక్కగ చదివే పిల్లలము
విత్తనాలు మేమౌతాము ॥చది॥

—డి. సుజాతాదేవి

ప్రవర్తన చూస్తే శకునిగా గోచరిస్తాయి. అందరూ భక్తులుగానే కనిపిస్తారు. రక్తులతో కూడిన వ్యక్తులేగాని భక్తులుకాదనే విషయం వారి నడవడికలో స్పష్టంగా కనిపిస్తూ ఉంటుంది. భక్తులు చేయవలసిన పనులు చేస్తున్నారా? పేరుకు మాత్రమే వీరు భక్తులు. మా బజారంతా బ్రాహ్మణులే, కోడిపెట్టమాత్రం కనిపించడంలేదన్నట్లున్నది ఈ భక్తుల సంగతి. మనం భక్తులం అనుకున్నప్పుడు భక్తి ప్రవర్తన నిరూపించాలి ఎటుచూచినప్పటికీ ఏకత్వమే దృక్పథమై ఉండాలి. కాని ఈనాటి భక్తి తత్వం విరుద్ధంగా మారుతున్నది. కనుకనే దైవత్వాన్ని అర్థం చేసుకోలేని మూర్ఖులుగా తయారవుతున్నారు. దీనికి కారణం స్వార్థం, స్వప్రయోజనమే. మానవునియందు దుష్టబుద్ధులు ప్రవేశించినప్పుడు, ఎంతటి క్రూరులుగా నయినా తయారు కావడానికి సిద్ధమవుతారు. ఇదికాదు మానవత్వం యొక్క విశిష్టత. దివ్యత్వంయొక్క పవిత్రతను చవిచూడటానికి అవసరమైన కృషిచేయాలి మన ప్రాపంచిక సంబంధమైన దివ్యత్వాన్ని కూడా ప్రకటించాలి.

## భౌతికవాదులు

ఏక కాలమందు అనేక విధములైన వ్యక్తిత్వములు ప్రకటితమైనప్పుడు దీనిని భౌతికవాదులు అంగీకరించరు. రసాయనిక శాస్త్రజ్ఞునికి పదార్థ విజ్ఞాన శాస్త్రం అంతగా తెలియదు. యం. బి. బి. యస్ చదివేడాక్టర్‌కు ఇంజనీరింగ్ విషయం ఏమాత్రం అర్థంకాదు. తెలివితేటలు తన విద్యయందు మాత్రమే అభివృద్ధి గావించుకోవచ్చు. మరొక విషయంలో తన తెలివితేటలు ఏ మాత్రం పనికిరావు. అదే విధముగనే భౌతిక శాస్త్రజ్ఞుని యొక్క విశ్వాసం యొక్క పరిమితి ఆధ్యాత్మిక విశ్వాసంయొక్క పరిమితితో పోల్చుకోవడానికి వీలుకాదు. ఆధునిక సాంకేతిక విజ్ఞానం వికసిల్లినదని భావిస్తున్న ఈకాలంలో, ఎక్కడో ఢిల్లీలో ఆకాశవాణి, టెలివిజన్‌లలో ప్రసార మవుతున్న పాటలను ఎవరింట్లో వారు కూర్చొని వినగలుగుతున్నారు, చూడగలుతున్నారు. ఏక కాలంలో కోట్లాదిమంది ఈ అనుభూతిని పొందుతున్నారు. అటువంటప్పుడు అలనాడు

గోపాలకృష్ణుడు 16వేలమంది గోపికలకు తమ ఇండ్లలో ఒకే పర్యాయం కనిపించాడని చెబితే అనేక ప్రశ్నలు, విమర్శనలు చేస్తున్నారు. ఈనాటి యంత్రశక్తికే యింత శక్తి ఉన్నప్పుడు అనాటి మంత్రశక్తికి ఎందుకు ఉండ కూడదు ? దీని అంతరార్థాన్ని గుర్తించలేని వ్యక్తులు ఇది సాధ్యమా ? అని విమర్శిస్తున్నారు. ! శబ్ద తరంగములు విద్యుచ్ఛక్తి తరంగములతో లీనమై అనంతమైన శక్తిగా మారి ఈథర్‌లో సంచారంచేసి రేడియోలో వినిపిస్తున్నాయి, టెలివిజన్‌లో కనిపిస్తున్నాయి. ఈ వాస్తవాన్ని మనం గుర్తిస్తున్నాము గదా! దీనికి జీవితం అవసరంలేదు. జీవితం తదుపరి కూడా దీనిని అనుభవించడానికి వీలవుతుంది. ఘంటసాల శ్రావ్యంగా పాడేటటువంటివాడు. కాని అతను గతించాడు. కాని ఈనాటికికూడా అతని స్వరమును స్వచ్ఛంగా మనం వినగలుగుతున్నాం. దీనికి కారణమేమిటి ? శబ్ద తరంగములు విద్యుత్ తరంగములతో కూడి ఉంటున్నాయి. ఇట్టి తరంగములు ఏనాటికైనా, ఎన్నియుగాల వరకైనా నిలచి వుంటాయి. ఇది కనిపెట్టక పూర్వం కూడా ఈ తరంగములు ఉన్నాయనే విషయం అర్థం చేసుకోవాలి. మన ఇంట్లో రేడియో లేకపోతే ఢిల్లీలో పాడే పాటలను వినగలుగుతామా ? రేడియో వున్నప్పటికీ ఢిల్లీ స్టేషన్‌ను ట్యూన్ చేయకుండా, మద్రాసు స్టేషన్ పెడితే ఢిల్లీ పాటలు వినపడవుగదా ! ఈ విధముగనే సర్వత్రా వ్యాపించినటువంటి దైవత్వాన్ని, చిత్తము అనేటువంటి రేడియోయందు, ఏకాగ్రత అనే స్విచ్‌ను వేసి దివ్యత్వమనేటటువంటి ఆనందంలో మనం మునిగినప్పుడు, ఆ దివ్యత్వమనేటటువంటిది మనకు అర్థమవుతుంది. శబ్ద తరంగములు ఒక్కటికూడా వ్యర్థం కావటం లేదు. సర్వత్రా నిండి వున్నాయి. వాటిని మనం జ్యోతిర్ తరంగములుగా మార్చుకోవాలి. ఇది ధ్యానశక్తి, యోగశక్తి, ఇట్టి శక్తిని వారు అనుభవించి, ఆనందించడం చేతనే గోపికల కందరికి ఏకకాలంలో శ్రీకృష్ణపరమాత్మ సందర్శనం ప్రాప్తించగలిగింది.

# శ్రద్ధాంజలి

ప్రముఖ సాహితీవేత్త, పండితుడు,
బహుభాషాకోవిదుడు

## ఆచార్య దివాకర్ల వెంకటావధాని

ది. 20-10-1986 న బొంబాయి జస్లోక్ ఆసుపత్రిలో పరమపదించారు. "శ్రీవాణి" ప్రారంభ సంచికావిష్కరణ సభలో పాల్గొని తమ ఆశీస్సుల నందించిన ఆచార్యుల వారికి 'శ్రీవాణి' పక్షాన నా శ్రద్ధాంజలి ఘటిస్తున్నాను.

— సంపాదకుడు

## భక్తితత్వం

గోపికల చిత్తము ఎల్లప్పుడును భగవంతుని రూపంతోను, నామంతోను హత్తుకొని పోయి ఉన్నాయి. కనుక ఈ విధమైన భక్తి తరంగములకు ఏమాత్రం కూడను **reason** వెదకడానికి మనకు అధికారం లేదు. ఇలాంటి అనుభూతులు beyond reason. ప్రత్యక్ష ప్రమాణములు వీలుకావు. నేడు కొన్ని చిన్న చిన్న విషయాలకే ప్రత్యక్ష ప్రమాణములు ఏమాత్రం పని చేయలేనప్పుడు, దివ్యత్వమైనటువంటి ఆత్మ తత్వమైన భగవత్ తత్వమునకు ఏరీతిగా ప్రమాణములు గురికావాల్సి వస్తాయి. ఈ ఆధ్యాత్మిక తత్వాన్ని అర్థం చేసుకున్నవారు వ్యర్థమైన మార్గాలలో ప్రవేశించరు. ఎవరి భక్తి తత్వం వారిది. ఎవరి భావం వారికే తెలుసు. ఒకరి భక్తి మరొకరు అర్థం చేసుకోవడం కష్టం. ప్రాచీన కాలంలో అనేకమంది దివ్య పురుషులు వీటిని దర్శించి, అనుభవించి, ఆనందించి తరించారు. వర్షం కురుస్తున్నప్పటికీ కుండను బోర్లించినచో ఒక్క చుక్క కూడా దానిలో ప్రవేశించదు. వర్షమునకు ఎదురుగా మాత్రమే కుండ మూతిని వుంచినప్పుడు కొంత జలం దానిలో ప్రవేశిస్తుంది. ఈనాడు భగవత్

" శ్రీవాణి " జీవితసభ్యులు



శ్రీ మల్లాది సూరిబాబు
శ్రీమతి మల్లాది రుక్మిణమ్మ
మచిలీపట్నం

శక్తి సర్వత్రా దండిగా నిండుగా ఉంటునే ఉన్నది. అయితే సూటిగా ఆటు హృదయాన్ని త్రిప్పడం లేదు. అడుగడుగునా మనకు అనుమానాలే. క్షణక్షణమూ సందేహాలే. తనను తానే నమ్మలేక పోతున్నాడు. నాలుగు క్షణాలు జీవించే నరుని నమ్మలేనివాడు నారాయణుని నమ్మగలడా ? మన నమ్మకంలో వున్న దోషమేగాని, దైవంలో ఎట్టి మార్పును లేదు. మనం ధృఢమైన విశ్వాసం కలిగి ఉండాలి. క్షణం క్షణం మనం మార్పు చెందరాదు. ఇలాంటి చిత్తశుద్ధి లేనటువంటివారు ఎంతకాలం తిరిగినప్పటికీ, ఎన్ని విధములైన సాధనలు చేసినప్పటికీ దైవానుగ్రహమును ఏమాత్రం పొందలేరు. ఏ పూజలు నీవు చేయకపోయినప్పటికినీ, ఏ ధ్యానము చేయకపోయినప్పటికినీ, నీ చిత్తశుద్ధిని నీవు సరైన రీతిలో ఉంచుకున్నప్పుడే దైవానుగ్రహం ప్రాప్తిస్తుంది. చిత్తశుద్ధి గలవానికే భగవదానుగ్రహం లభిస్తుంది.

## అహంకారం

గోపికలు " మేము మీ వారము " అని ప్రార్థించారు. గోపీకృష్ణుడు మావాడు అని విశ్వశించారు కొందరు. మావాడు అనే విశ్వాసంచేతనే అహంకారం వారిలో పెరిగిపోయింది. అహంకారం ఎక్కడ వుండునో అక్కడ అధఃపతనం తప్పదు. కనుకనే యాదవ కులంలో ముసలం పుట్టింది. ఎంతకాలమైనప్పటికీ స్వామీ ! మేము మీ వారమని ప్రార్థించిన గోపికలు క్షేమ సంతోషాలను అనుభవించారు. కనుకనే పిల్లలకు మూడు ముచ్చటైన మాటలు చెప్పాను. " Don ' t walk in front of me, I may not follow;Don ' t walk behind me, I may not lead; walk still, walk beside me. Be my friend " నా ముందు నీవు నడవడానికి ప్రయత్నించుతే నీవు నాకు తప్పు మార్గం చూపవచ్చు. మార్గం నీకు తెలియదు. పోనీ నా వెనుక నన్ను అనుసరించడానికి ప్రయత్నించుతే నన్ను తప్పించుకొని నీవు వెళ్ళవచ్చు. నా ప్రక్కనైతే నీవు తప్పించుకోవడానికి గాని, తప్పు మార్గాన పోవడానికి గాని అవకాశం వుండదు. ఎందుకనగా నేను నీ వెంటనే వున్నాను. దీనియొక్క అంతరార్థం ఏమిటంటే నీవూ నేనూ ఒక్కటిగానే వున్నాము. అనగా దైవత్వం సర్వత్రా ఉంటున్నది. ప్రతి దేహమునందునూ దేహి అయివున్నాడు. అలాంటి సమయంలో నీవుముందుకు పోవడానికి గాని వెనుకకు రావడానికి గాని వీలుకాదు. దైవత్వాన్ని నీతో కూర్చుకొని రావాలి, దైవాన్ని నీతో చేర్చుకొని రావాలి. ఇదియే నిజమైన సాధకుడి లక్షణం.

## శీలత్రయము

పవిత్రము, సహనము, ధైర్యములను శీలత్రయమంటారు. వీటిని సాధించినచో దేనినైనా మనం సాధించగలం. పవిత్రము లేనివానికే సహనం వుండదు. సహనం లేని వానికే ధైర్యము చాలదు. ధైర్యము లేనప్పుడు వాడు బలహీనుడై పోతాడు. తాను చెడటమేగాక పరిసరాలను కూడా చెడగొడుతాడు. ఇలాంటి జీవితము మానవ జీవితమే కాదు. కనుక మనం బాగుపడి ఇతరులను బాగుచేయడానికి కృషి చేయాలి. ఏకత్వమైన దైవత్వాన్ని మనం సాధించాలి. సర్వం కోల్పోయినా ఫరవాలేదు. దైవాన్ని మాత్రం కోల్పోరాదు. అటువంటి నిత్యమైన సత్యమైనటువంటి దానిమీద విశ్వాసం అభివృద్ధి చేసుకోవాలి.

( ది 11 - 10 - 86 న దసరా పండుగల సందర్భమున ప్రశాంతి నిలయంలో భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారు యిచ్చిన ఉపన్యాసం )



# పూలు తగలపెట్టొద్దు

(గతసంచిక తరువాయి – 2)

వాణీ రంగారావు

## మర్నాడే స్కూలుకి శెలవలు.

" వదినా ! ఈ సెలవల్లో నా స్నేహితురాలి ఊరికి వెళ్దామనుకుంటున్నాను. ఇల్లుకూడా ఇంత పెద్దది నాకు అనవసరం. అందుకే సామాను రవిగారి ఆఫీసు వెనక ఓ రూం ఖాళీగా వుంది, అక్కడ పడేసి వెళ్దామనుకుంటున్నాను " అంది.

" అయ్యో ! అదేవిటమ్మా ! మేము ఇక్కడే ఉందామనుకుంటున్నాము తల్లీ. ఒక్కదాన్నీ దిక్కులేనట్టు వదిలి ఎక్కడో మేం పడివుండటం ఎట్లా ? నలుగురూ నాలుగిందాల అనుకోరూ ! అయినా మాకయి ప్రాణం ఒప్పద్దూ " అంది వదినగారు.

అయినా భవిష్యత్తు కళ్ళల్లో మెదిలి తన నిర్ణయాన్ని సడలించుకోలేదు. " ఫర్వాలేదొదినా ! రెండు నెలలపాటు ఉండను. నెలకి అయిదొందలు అద్దె మళ్ళీ దండగ. పైగా పిల్లలకి స్కూళ్ళుపోతాయి. " అంటూ ఖచ్చితంగా మాట్లాడేసరికి వాళ్ళల్లో వాళ్ళే మల్ల గుల్లాలు పడి వెళ్ళిపోయారు.

అంత ఇంట్లో ఒంటరిగా మిగిలిపోయింది పల్లవి.

తన జీవన గానానికి చరణాలు లేవు పల్లవి తప్ప.

ఆ పల్లవి కూడా మూగవోయిన గుండెలో నిశ్శబ్దమైపోయింది.

రవి సలహా మేరకు పల్లవి ఆ ఇల్లు ఖాళీచేసి చిన్న ఇంట్లోకి మారింది. ఇల్లంతా సర్దేటప్పుడు ఎన్నో జ్ఞాపకాలు. ముసాఫిర్ బట్టలు, అతని బూట్లు, అతని రిస్ట్‌వాచీ, అతని సెలెక్షన్‌లో కొన్న ప్రతి చిన్న వస్తువూ పల్లవిని దుఃఖపెడ్తూంది.

రవి తానే స్వయంగా ముసాఫిర్ తాలూకు వస్తువులన్నీ ఒక ట్రంక్‌లోపెట్టి తాళం వేసేశాడు. పల్లవి నవ్వుకుంది. అతని వస్తువులైతే దాచేశావు రవీ అతని స్పర్శలో అణువణువూ పునీతమైన ఈ భౌతికత నేంచేస్తావు అనుకుంది.

ఇల్లు ఖాళీచేసి కొత్త ఇంట్లోకి మారి సెటిల్ అయేంత వరకూ రవే అన్నింటా సాయంచేశాడు. ముసాఫిర్ బ్రతికి ఉంటే ఇది ఇంతకంటే బాగా జరిగిఉండేది అనే భావన రానంతగా ఆ లోటు కనపడనీయకుండా రవి పల్లవికి అండగా నిలబడ్డాడు.

" పల్లవిగారూ ! మీరు మరోసారి ఆలోచించుకోండి. ఇకనైనా మించిందేమీలేదు. మీ ట్రాన్స్‌ఫర్ కోసం ప్రయత్నిస్తాను. మీరూ మా వూరొచ్చేస్తే బావుంటుందేమో!" రవికి పల్లవి నిస్సహాయంగా ఈఊళ్ళో ఒక్కత్తే ఉండడం అంత ఇష్టంలేదు. ఎలాగైనా తన ఊరికి తీసికెళ్ళాలని ఉంది.

" లేదులెండి రవిగారూ ! ఎక్కడ ఉన్నా ఈ ఒంటరితనం తప్పదుగా ! మళ్ళా అలవాటుపడిన ఈ చోటు వదలి ఎక్కడో కొత్త జీవితం మొదలుపెట్టాలి. దానికన్నా ఇదే నయం కదా. " అంది పల్లవి.

రవి మేనమామ కూతురు వనజ. వీళ్ళిద్దరూ పుట్టగానే పెద్దవాళ్ళు నిర్ణయించేశారు. వీళ్ళిద్దరూ మొగుడూ పెళ్ళాలని ముద్ర వేసేశారు. వనజ తండ్రి ఓ పేద్దభూస్వామి. ఏడు మల్లె పువ్వులెత్తు రాకుమారిలాగా పెంచారు. రవి ఎం. ఏ

అయిపోయాక మెడికల్ కంపెనీలో రిప్రజంటెటివ్‌గా జాయినయ్యాడు. వనజ బి. ఎ ఫైనలియర్‌లో ఉంది. గ్రాడ్యుయేషన్ పూర్తయ్యాక పెళ్ళి చేద్దామని చూస్తున్నాడు వనజ తండ్రి.

వనజ తన మాట ఏదైనా గుడ్డిగా చెల్లాలనుకుంటుంది. అలాగే చెల్లుతుందికూడా. ఒక్కతే కూతురు. అడిగినంత సంపద. ఆడింది ఆట పాడింది పాట.

అయినా ఆ అమ్మాయి మనసంతా రవే. ఆ పిల్ల ఊహలు, ఆపిల్ల కలలు, ఆమె లోకం అంతా రవిమయం.

మేనమామ అవడం మూలాన ప్రతి సెలవలకీ వాళ్ళ ఊరికి వెళ్ళడం వనజతో గడపడం అలవాటు. నెలకి పదిహేను రోజులు క్యాంపు ఉంటే మిగతా పదిహేను రోజుల్లో అయిదారు రోజులు ఆఫీసు వర్కు ఉన్నా మిగతా రోజుల్లో పనేమీ ఉండదు. ప్రతి నెలా కనీసం వారానికి తగ్గకుండా సెలవలు వనజతో గడిపేవాడు. అలాంటిది ముసాఫిర్ పోయిన దగ్గరినుంచీ అలా వెళ్ళడం కుదరక ఎప్పుడో ఒకసారి వెళ్ళడం ఓ రోజు ఉండిరావడం జరుగుతూంది. వనజకు అసంతృప్తిగాఉన్నా ఏంఅనలేదు-రవిపట్ల ఆమెకున్న అభిమానం ఆమెను కట్టి పడేసింది.

అయినా ఒక్కసారిగా అతని పట్ల అయిష్టత గానీ, అసంతృప్తిగానీ వ్యక్తీకరించేంత అవివేకం ఆమెకు లేదు. అందుకే మవునంగానే ఉంది. రవి ఆమె మవునాన్ని గమనించలేదు. అతనికి తేడా తెలీలేదు రోజులు గడిచే కొద్దీ రవినించి దూరం అవుతూ వస్తూంది వనజ మనసు.

" బావా! ఈ మధ్య సెలవలకు రావడం మానేశావు? ఎందుకని ? " ఉండబట్టలేక అడిగేసింది వనజ

" ఏవో పన్లు! నా ఫ్రెండ్ ముసాఫిర్ పోయాడు. పల్లవి ఒంటరిదై పోయింది. వాడు లేని లోపం మనం తీర్చేది కాకపోయినా తనకు ఆత్మ విశ్వాసం కలిగించాల్సిన అవసరం ఉంది. నీకు తెలుసుగా ముసాఫిర్ నాకు చిన్నప్పటి ఫ్రెండ్. వాడు పోవడం పల్లవికి ఎంత నష్టమో నాకూ అంతే. వనజా! పల్లవిని అలా చూస్తోంటే నాకు గుండెలు తరుక్కుపోతున్నాయి. " కళ్ళనీళ్లతో చెప్తున్న రవిని చూసి తానూ అంతగానూ కదిలిపోయింది వనజ.

" నేనూ ఓసారి పల్లవిని చూసి వస్తాను బావా! నన్ను తీసుకెళ్ళకూడదా ! " అడిగింది వనజ.

" అలాగే వనజా ఈ సారి వెళ్దాం. "

ముసాఫిర్ పోయిన ఆరు నెలలకు పల్లవి ఇల్లుమారటం, రవి వనజతో కలిసి పల్లవి దగ్గరకు రావడంజరిగింది.

రవి, పల్లవి ఒకే రకమయిన బాధతో ఉన్నారు. ఒకరి నొకరు ఓదార్చుకునే స్థితిలో ఉన్నారు. ఒకరి దుఃఖాన్ని ఒకరు తగ్గించుకునే యత్నంలో ఉన్నారు.

" పల్లవీ! చాల పాడయిపోయారు మీరు. ఇంతగా ఆలోచిస్తే మీ ఆరోగ్యం దెబ్బతింటుంది. "

" మీరు మాత్రం! ఎలా ఉండేవారు ఎలా అయిపోయారో తెలుసా! కావాలంటే వనజని అడగండి. ఏమ్మా వనజా ? " నవ్వించాలని ఎంత ప్రయత్నం చేద్దామన్నా అలముకున్న చిక్కదనం ఇంకా దట్టమవుతోందే తప్ప వదలడం లేదు.

నవ్వి ఊరుకుంది వనజ. వనజ ఎందుకో ఫ్రీగా ఉండలేకపోతోంది. బావ అంత చనువుగా మరొక ఆడపిల్లతో ఉంటాడా? ఇలాంటి ఊహలు ఆమెను ఇబ్బంది పెడుతున్నాయి.

ముగ్గురికీ ఎవరి ఆలోచనలు వాళ్ళకి ఉన్నాయి. అందరూ నటిస్తూనే ఉన్నారు.

" అబ్బ! ఏవిటీ సైలెన్సు. సినిమాకి పోదాం పదండి! పల్లవిగారూ మీ కిష్టమయిన " సాగర సంగమం " వచ్చింది. లేవండి. " రవికి ఆ చిక్కదనాన్ని పోగొట్టాలంటే అంతకంటే మరో మాట తోచలేదు.

" వనజకి ఏ సినిమా ఇష్టమో! చెప్పు వనజా దేనికి పోదాం ?

" మీ ఇష్టం. "

" వనజకా! 'డిష్యుం డిష్యుం' లేకపోతే హాంఫట్! ఏం వనజా! "

“ అయితే జై భేతాళ గానీ, పారిపోయిన ఖైదీలు గానీ. ” అంది పల్లవి.

“ అబ్బ ! నేనా తలనొప్పి భరించలేను. పోతే సాగర సంగమం అంతే. ” రవి

“ సాగర సంగమానికే వెళ్దామండి ? ” అంది వనజ.

అందరూ వెళ్ళారుగానీ, వనజకు తెలియని అసంతృప్తి. ఇదీ అని చెప్పలేని బాధ. పోనీ కారణాలు వెతుక్కున్నా కనిపించడం లేదు. ఏదో వెల్తి.

పది రోజులు సెలవలు గడుపుదామని వచ్చిన వనజ రెండు రోజులకే వెళ్ళిపోతానంది. ఉండమని ఎంత బతిమాలినా వనజకు ఉండబుద్ధికాలేదు రవికి ఇంకా కాంప్ ఇక్కడేఉంది. రవికి వనజతో వెళ్ళడానికిలేదు బస్సుదాకా రవీ, పల్లవీ వెళ్ళి బస్సెక్కించారు. బస్సులో కూర్చున్న వనజకు ప్లాటుఫారంమీద నుంచున్న పల్లవీ,రవి జంటగా- వనజ మనస్సులో వెల్తి ఇంకా ఇంకా పెరుగుతూంది. బస్సు వెళ్ళిపోయింది. రవీ, పల్లవీ ప్లాట్‌ఫాంమీద మిగిలిపోయారు.

ఎందుకో పల్లవికి ఈ స్థితి బాగాలేదు. ఇబ్బందిగా ఉంది. కాని తప్పు పట్టేందుకేమీ లేదు. ఎక్కడో శృతి తప్పుతోంది.

రవికి ఒక్కటే ఆలోచన. ముసాఫిర్‌ని పోగొట్టుకొని పల్లవి అనాధ అయిపోయింది. తనను అనాధను కానియ్యకూడదు. ఆమె ఒంటరితనాన్ని ఎలాగయినా పోగొట్టాలి. అందుకే తన కాలాన్ని ఆమెకే కేటాయించాడు. అతని దృష్టిలో ఈ ఒక్క విషయమే సజీవం. మిగతా వేవీ అతని హృదయాన్ని తాకడం లేదు. ఈ ఉద్వేగంలో ఒకోసారి ఉచితానుచితాలను మరిచి పోతున్నాడు. అది అతనికి ఎప్పట్టుగా తోచడంలేదు.

వనజ ఇంటికి వెళ్ళిందే గానీ ఆమె మనసు కుదుట పడడం లేదు. ఎవరికి చెప్పకోనూ ఏమీలేదు. అయినా ఏమీ లేకుండానూ లేదు కిలకిలా పరుగులు తీస్తూ ఉండే వనజ నిశ్శబ్దంగా తిరుగుతోంది. తల్లిదండ్రులకు ఆశ్చ



ర్యంగా ఉంది. ఆజ్ఞాపించడం, అమలు పర్చకపోతే అందర్నీ అదలాయించి తన పట్టుదల నెగ్గించు కోవడం ఆ అమ్మాయి అలవాటు. అందుకు భిన్నంగా ఎవరేం చేసినా చెయ్యక పోయినా పట్టించుకోకుండా నిర్లిప్తంగా ఉన్న వనజను చూస్తుంటే వాళ్ళ నాన్నకు ఏవిటోగా ఉంది. ఒక్కగా నొక్కకూతురు. దేనికీ లోటు కాకుండా కష్టం అంటే ఏవిటో తెలీకుండా పెంచాడు. ఆయనకి అర్థం కాలేదు ఎందుకు వనజ ఇలా ఉందో. అడగడానికి పెద్దరికం అడ్డం వస్తుంది. అయితే ఒక్కటి గమనించాడాయన. సెలవులకి రవి దగ్గరికి వెళ్ళొచ్చాకే ఇలా అయింది కూతురు అని. అసలేం జరిగిందీ ఆయనకు అంతు పట్టలేదు. ఎందుకైనా మంచిదని ఒకసారి రవి దగ్గరకు వెళ్ళొద్దామని బయలుదేరాడు.

విజయవాడ చేరేసరికి మిట్టమధ్యాహ్నం పన్నెండయింది. రవి రూము తాళం వేసి ఉంది. హోటల్లో భోంచేసి మళ్లా రూము దగ్గరకు వచ్చాడాయన. ఇంకా తాళం వేసే ఉం . ఆఫీసుకి వెళ్ళాడు. ఆఫీసు ప్రొద్దుపోవడంతో మూసి ఉంచ-

## నెహ్రూ

దేగల సభలో
పావురం అద్భుత భాషణ
రాత్రి కనిన రంగుల కలలన్నీ
రాతి గట్టు మీద
తలలు పగులగొట్టుకుంటూన్న
కడలి అలలు !
చెరసాలను వరించిన
కుబేరుడు
సింహాసనం మీద చతికిలబడే
గొంతులో తులసితీర్థం పోయించుకున్న
ప్రజాస్వామ్య దేవేంద్రుడు !
మనకు 'నవీన రఘువంశాన్ని' ప్రసాదించిన
అధికారోజ్జ్వల సహస్ర కిరణుడు !!

- డా॥ తంగిరాల వెంకటసుబ్బారావు

వాచ్ మన్‌ని అడిగాడు రవి ఎక్కడ అని. ఫలానాచోట ఉంటాడని చెప్పాడతను. వెతుక్కుంటూ పల్లవి ఇంటికి వెళ్ళాడు. అక్కడ ఉన్నాడు రవి.

ఇంటి ముందు లాన్‌లో చెరో కుర్చీలో కూర్చుని ఉన్నారు రవీ, పల్లవి. మేనమావను చూసి గభాలున లేచి ముందుకొచ్చి గేటు తీసాడు రవి.

" రండి మావయ్యా ? ఎప్పుడొచ్చారు ?

" మధ్యాహ్నం రవీ ! అప్పట్నించీ నీకోసం.... "

" నేను మూడింటికి వచ్చి ఇక్కడే ఉన్నాను. అయ్యో ఎండలో మీరెక్కడ తిరిగారో! " రవిమొహంలో ఎక్కడా గిల్టీనెస్ తోచలేదు.

" ఫర్వాలేదులే "

" మీకీ అడ్రసు ఎలా తెలిసింది. "

" వాచ్‌మన్ చెప్పాడు. "

" ఆఫీసు వాచ్‌మనా ? "

" ఆ ! "

పల్లవి లేచి నిల్చుంది.

" మావయ్యా ! వీరు పల్లవిగారు. నాస్నేహితుడు ముసాఫిర్ అని మీకు తెలుసు. తన వైఫ్. మొన్న ఆక్సిడెంటులో.... "

" ఆ ! ఆ ! అవును పాపం చాల మంచి కుర్రాడు. ఆరునెల్లయిందనుకుంటా. " పల్లవిని చూస్తుంటే ఆయనకూ గుండె కలచి వేసినట్లయింది. మొహంలో పసితనం పోలేదు. ఇంకా సంయమనశక్తితో తనని తాను అదుపులో పెట్టుకునే వయసు రాలేదు పాపం ఈ పిల్లకి అనిపించిందాయనకి. అనుభవజ్ఞుడు. ఎన్నో ఆటు పోట్లు తిన్నవాడు. ఒక్క క్షణంలో అంతా అర్థం అయిపోయింది.

" నమస్కారమండీ, కూర్చోండి. " తాను లేచిన కుర్చీ చూపించింది.

" నమస్కారమమ్మా "

" ఏం మావయ్యా ! సడన్‌గా వచ్చారు. పని మీదేమైనా వచ్చారా ? "

" ఏం లేదు రవీ ! చూడాలనిపించింది. ఏమ్మా కులాసాయేనా ? "

" ఆ ! " ఏం చెప్పాలి ? ఏనాటికి ఈ స్థితినించి కులాసా చిక్కుతుంది తనకు ! ఏనాడూ తన విషయంలో పెద్దగా ప్రవర్తించాల్సిన అన్నా వదినెలు హుందాగా తన పట్ల నిజమైన బాధ్యతా, మమకారాలతో ప్రవర్తించలేదు. వనజ తండ్రి ఈయన. ఎంత అదృష్టవంతురాలు. మంచిమనసూ, రూపం, ఉద్యోగం ఉన్న రవి తనవాడు. ఇటు తండ్రి అటు భర్త - వనజ లాంటి ఆడపిల్లలు. జీవితంలో దేనికీ కొరత పడాల్సిన పని ఉండదు. పల్లవి మనసులో ఈర్ష్య కాదుగానీ— ఆ అదృష్టం తనకు లేదు కదా అని మొదటిసారిగా బాధ కలిగింది. ఆయనలో తండ్రి కనిపించాడామెకు. కళ్ళలో నీటి చారిక.

" కూచోండి బాబాయిగారూ కాఫీ తెస్తాను. " గిరుక్కున వెనక్కి తిరిగి వంటింట్లోకి దారి తీసింది.

( సశేషం )

# కంటి కలక ............ ఎస్. ఎన్. దుర్గారావు

అంటువ్యాధులలో కంటి కలక ఒకటి. కంటి కలక వచ్చినవారిని చూచుట ద్వారా, వారు వుపయోగించిన వస్తువుల ద్వారా ఒకరినుంచి ఒకరికి త్వరితముగా వ్యాపిస్తుంది.

ఈ వ్యాధి రావటానికి గల కారణములు పరిశీలిస్తే, వాతావరణంలో మార్పులు సంభవించి తద్వారా వాతావరణ కాలుష్యం ఏర్పడినపుడు ఒక రకమైన "వైరస్" వలన కలుగుతుంది అని తెలియవచ్చింది.

ఈ కలక ఎక్కువ మందికి నిద్రిస్తున్న సమయంలోనే వస్తుంది. ఉదయం లేచేసరికి కళ్ళచుట్టూ పుసులు కట్టి అంటుకుని, కళ్ళు తెరవటం కష్టమౌతుంది. ఈ పరిస్థితిలో చల్లని నీటితో కళ్ళు చుట్టూ శుభ్రపరచి కళ్లుతెరవాలి. ఈ పరిస్థితి ఏర్పడినపుడు మనకు కళ్ళు కలిగాయి అనే విషయం అర్థమౌతుంది. కంట్లో నలుసు పడినట్లుగా అనిపిస్తుంది, కళ్ళు ఎర్రబడతాయి. రెండవ రోజు కళ్ళు విపరీతంగామండుతూ, మూడవ రోజుకల్లా తీక్షణంగామారి కళ్ళ వెంబడి నీరుకారుట మొదలౌతుంది. కళ్లు బాగా ఎరుపెక్కి తలనొప్పిగాకూడా ఉంటుంది. ఈ దశలో రెండు మూడు రోజులు బాధించి క్రమేపీ తగ్గుతుంది. కొందరికి ముందుగా ఒకకంటికి వచ్చి, తరువాత రెండవదాని కొస్తుంది.

కొందరికి కంటి కలక వస్తే ఎక్కువగా బాధించక రెండు మూడు రోజులలోనే పోతుంది. మరి కొందరికి తీక్షణంగా మారి వారం రోజులు బాధపెట్టి పోతుంది. అంటే వారి వారి వ్యాధి నిరోధక శక్తిపై ఆధారపడి ఉంటుంది.

ఇలా కళ్లు కలిగినపుడు కొందరికి మందులు వాడకుండానే క్రమంగా తగ్గుముఖం పడుతుంది. అలా అని అందరూ ఏ పరిస్థితిలోనైననూ ఈ వ్యాధికి గురి అయినపుడు నిర్లక్ష్యం చెయ్యక తగు చికిత్స చేసుకోవాలి నిర్లక్ష్యంచేస్తే ఒక్కోసారి కంటిలోని సున్నితమైన నరాలు దెబ్బతినే అవకాశం ఉండవచ్చు. అదీగాక మంచి రోజులను పాడుచేసుకున్న వారమౌతాము.

కళ్లు మండుతున్నట్లుగా అన్పించి కలక వస్తుందనే అనుమానం కలిగినపుడు, నిద్రపోయే సమయంలో నంది వర్థన పువ్వులుగాని కలువ పువ్వులుగాని, జాజి పువ్వులు గాని కంటిపై వేసి కట్టుకుని పడుకుంటే ఆదిలోనే ఇది రాకుండా జాగ్రత్త పడవచ్చు. వచ్చిన తరవాత నీరు కారుతుంటే పసుపు నీటిలో తడిపి ఆరవేసిన మంచి గుడ్డతో తుడుస్తుంటే త్వరగా తగ్గుతుంది. కంటిని శుభ్రపరచవలసివచ్చినపుడు చల్లని నీరు మాత్రమేవాడాలి.




కంటి కలకకు ఇతర చికిత్సలు చాలా వున్నాయి ఆయుర్వేదంలో. కొన్ని ముఖ్య చికిత్సలు క్రింద వ్రాయబడ్డాయి. ఏది అందుబాటులో ఉంటే అది చేసుకోవచ్చు

1) తొలిచూలు తల్లిపాలు రోజుకు రెండు మూడుసార్లు రెండేసి చుక్కల చొ॥న రెండు కళ్ళలో వేసుకోవచ్చు.

2) నంది వర్ధనం చెట్టువద్దకు ఉదయం వెళ్ళి ఆకుగాని, కాడగాని తెంచితే పాలు వస్తాయి. ఒక్కొక్క చుక్క చొ॥న రెండు కళ్ళలో వేసుకోవచ్చును.

3) నీరుల్లిరసం కంటిలో చుక్కచొప్పున వేయవచ్చు.

4) పటికను నిప్పుపై పొంగించగా వచ్చిన నురుగును కొంచెంగా తీసుకుని చనుబాలలో వేసి రంగరించి కంటిలో ఒక్క చుక్క చొ॥న వేయవచ్చు.

కంటి కలక తగ్గేవరకూ కారము తగ్గించాలి. వేడిచేసే పదార్థములను, మాంసాహారమును మానివేయవలెను.

ఇంట్లో ఒకరికి కళ్ళు కలిగినపుడు ఆతను వాడే తువ్వాలును మరి ఒకరు ఉపయోగించకుండా జాగ్రత్త పడాలి కళ్ళు కలిగిన వ్యక్తితో మాట్లాడ వలసివచ్చినపుడు కొంచెం దూరంగా ఉండాలి. కంట్లోకి చూస్తూ మాట్లాడకూడదు.



# కుల సంస్కృతిని కూల్చేద్దాం

ల మాసాలలో మనరాష్ట్రాన్ని అటు గోదావరి వరదలు, యిటు రిజర్వేషన్ వుద్యమాలు కుదిపి వూపేసాయి. ఎప్పుడో 33 సం॥ క్రితం గోదావరికి వరదలు వచ్చి వూళ్ళకి వూళ్ళని ముంచేసినా ఈ నాటికీ కరకట్టల రక్షణకు ఎటువంటి జాగ్రత్తలు తీసుకోనట్లుగానే, బీహార్, మధ్యప్రదేశ్, గుజరాత్ వంటి రాష్ట్రాలలో పెచ్చరిల్లిన రిజర్వేషన్ ఉద్యమాల ఫలితాలను తెలిసికూడా మన రాష్ట్రంలో వెనుకబడిన వారికి రిజర్వేషన్ల శాతాన్ని పెంచారు.




గోదావరికి ఉధృతంగా వరదలు వచ్చి గ్రామాలకు గ్రామాలను తనలో కలుపుకున్నట్లుగానే, రిజర్వేషన్ల ఫలితంగా కులాలకు కులాలు సంఘటితం కావడం, సమాజం నిట్ట నిలువునా చీలడం కనిపిస్తున్నది. ఇది ఎంత దూరమొచ్చిందంటే ప్రభుత్వ, ప్రయివేటు ఆఫీసులలో వుద్యోగస్థులంతా కులాల వారీ విడివడి ఒకొర్నొకరు ద్వేషించుకునే స్థాయికి వచ్చింది. గోదావరి యివ్వాళ ప్రశాంతంగా ప్రవహించ వచ్చు.... కానీ ప్రళయ భీకర గర్జన చేస్తే మాత్రం మానవ యంత్రాంగం ఎందుకూ పనికిరాదని నిరూపించింది. అలాగే రిజర్వేషన్ వుద్యమాలు రాష్ట్ర ప్రభుత్వాని కేమిటి అసలు ప్రభుత్వాలన్నిటికీ కళ్ళు తెరిపించాయి. అనాలోచితంగా, స్వార్థం కోసం చేసే ఏ చర్యయినా అది బహుళ ప్రజానీకానికి ఆగ్రహం కలిగించ కలదని, ఆ ఆగ్రహం మెడలు వంచకలదనీ నిరూపించింది.

మొన్నీ మధ్య ఫిలిమ్స్ డివిజన్ వారు నిర్మించి విడుదల చేసిన ఒక చిత్రాన్ని చూసేభాగ్యం కల్గింది. ఓ టీచర్ చిన్నారి బాల బాలికలకు జాతీయ గీతాలను నేర్పి వాళ్ళు యిళ్ళకెళ్ళే టప్పుడు ఒక బాలికను పిలచి ఈ అప్లికేషన్ ఫారంలో మీ కులం ఏమిటో మీ అమ్మగార్ని అడిగి వ్రాయించుకురా! అని చెప్తుంది. పాపం! చిన్నారి ఆ హృదయానికి తన కుల మేమిటో? ఎన్ని కులాలుంటాయో....వీళ్ళలో ఎవరు ముందంజ వేసారో, ఎవరు వెనుకబడి వున్నారో ఈ వివరాలన్నీ తెలుసుకోవాల్సిన దుస్థితి ఏర్పడి నట్టేకదా!

టి. వి. చూస్తున్న అమ్మానాన్నను మన కులమేమిటి? అనడుగుతుంది. కనిష్క ఎయిర్ క్రాష్ దృశ్యాలను తదేకంగా చూస్తున్న నాన్న, అమ్మా కోపగించుకుంటారు. అయినా తప్పదు కదా! అమ్మగారు వివరించి చెప్తారు. మర్నాడు పాపాయి పుట్టినరోజు బిళ్ళల బాక్స్ చేతికిచ్చి సాయంకాలం తొందరగా యింటికి రా కేక్ కొయ్యాలి అని చెప్పి అమ్మగారు వీడ్కోలిస్తారు....

ఆనందంగా గంతులేసుకుంటూ స్వీట్స్ బాక్స్ టీచర్ కిచ్చి భారతమాతను స్తుతించే గీతాన్ని కమ్మగా ఆలపిస్తుంది ఆ పాప. సాయంత్రం గ్రౌండ్స్‌లో టీచర్ పిల్లలందరి చేత బంతి ఆట ఆడిస్తుంటే బంతి వెళ్ళి చెట్ల చాటున దాక్కుంటుంది. ఈ పాపాయి ఆ బంతి తీసుకు రావటానికి వెళ్ళి బంతిలాగా అక్కడ కనిపించిన ఒక వస్తువును పట్టుకుని విసిరి వేసేసరికి అది ప్రేలటం, పొగలు రావటం ఆ మంటలకు పాప ఆహుతికావటం జరుగుతుంది. పాపం కేక్ ముందు కూర్చుని కన్నీళ్లు కారుస్తుంది ఆ కన్నతల్లి. యింతకీ ఆ చిత్ర నిర్మాతలు ఏం చెప్పాలనుకున్నారో స్పష్టంగా మాత్రం బోధపడదు. ఏ కులాల వారయినా అందరూ చేరే గమ్యం ఒక్కటే అది చావు అని చెప్పాలనుకున్నప్పుడు ఆ చిన్నారిని బలి

చేయటం ఎందుకు ? ఆ పాపాయి చేత మనమేకులం అని అడిగించటమెందుకు ? జాతీయ సమైక్యత గీతాలాపన ఎందుకు ? యివన్నీ అర్థం కాని ప్రశ్నలు ? 'అంటరానితనం నేరం' అని క్లాస్ పుస్తకాల వెనకాల ముద్రించినట్లే వుంటుంది ? కుల వ్యవస్థ రూపు మాపాలనుకున్నప్పుడు అప్లికేషన్ ఫారాల్లో కులాన్ని గురించి వివరణ ఎందుకు ! అంటరానితనం నేరమని చిన్నారి బాలల క్లాసు పుస్తకాల మీద ముద్రిస్తే బళ్ళో టీచర్లు, యింట్లో తల్లిదండ్రులు ఆ కుల వ్యవస్థ గురించి వారికి విపులీకరించాలా ? అంటే ఏమిటి చిన్నారి – పసికందులకు ఉగ్గుపాలతో దేశ సంస్కృతిని నేర్పటానికి బదులు కుల సంస్కృతిని రక్తంలోకి యింజెక్ట్ చేస్తున్నా మనమాట. ఇందుకోసమేనా ఈ స్వాతంత్ర్యం ?.... కులాలు మతాల వారీ పాఠశాలలు, కళాశాలలు, ఇందులో కొందరు వెనుకబడినవారు, మరి కొందరు షెడ్యూల్‌లో చేర్చబడినవారు, మరి కొందరు అల్ప సంఖ్యాకులు, వీరందరికీ రాయితీలు. చివరకు రామకృష్ణా మిషన్‌లాంటి పేరొందిన సంస్థకూడా అల్ప సంఖ్యాక సంస్థగా మమ్మల్ని గుర్తించండి అని ప్రభుత్వానికి విన్నవించిందట. అంటే ఏమిటి ? అల్ప సంఖ్యాకులకు కల్పింప బడుతున్న రాయితీలు తమకు కూడా కావాలని కోరుకోవటం. రాయితీలు యిస్తూపోతూ వుంటే సమాజంలో అక్కరలేని వారు ఎవరుంటారు ? అందరూ ఏదో రూపేణా రాయితీలు కోరాలనుకుంటారు. ఇది ఒక వ్యాధి లాంటిది. అందుకే దేశవ్యాప్తంగా ఆందోళనలు, ఉద్యమాలు చెలరేగుతున్నాయి. కాశ్మీర్‌కు 370 అధికరణం క్రింద స్పెషల్ స్టేటస్ యివ్వబడితే అదే విధానం మాకు కూడా యివ్వండని పంజాబ్ మొదలైన రాష్ట్రాలు కోరుతున్నాయి. కోరటమేమిటి ఖలిస్థాన్ నినాదాలను మారుమ్రోగిస్తున్నారు కూడా ! యిప్పుడు అదే త్రోవలో లాల్‌డెంగాగారు మిజోరమ్‌కు ప్రతిపత్తి కావాలంటున్నాడు మేమెందుకు వూరుకోవాలని గూర్ఖా వారు కూడా మొదలెట్టారు. ఇట్లా ఎక్కడికక్కడ కులాలు, భాషలు, ప్రాంతాలవారీగా దేశం ఛిన్నాభిన్నం అయ్యే స్థితికి చేరుకుంటున్నదేమో అనిపిస్తున్నది. పరిపాలనా సౌలభ్యం కోసం భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పరచబడితే, యివాళ ఏ రాష్ట్రానికి ఆ రాష్ట్రం తమ తల్లులను ఏర్పరుచుకొని పూజలు చేస్తూ గీతాలు పాడుకుంటున్నవి; భరతమాత విస్మరింపబడుతున్నది.

ప్రకృతిలో ఎంతో వైవిధ్యం వుంది. రకరకాల చెట్లు, రంగురంగుల పూలు .... సువాసనలు వెదజల్లేవి కొన్ని, కంటికింపుగా కనిపించేవి మరికొన్ని; నీడ నిచ్చేవి కొన్ని ఫలాన్నిచ్చేవి యింకొన్ని .... వంటచెరకుగా కొన్ని వుపయోగపడితే, గృహ నిర్మాణానికి మరికొన్ని వుపయోగపడుతున్నాయి. మనం వదిలే గాలి పీల్చి స్వచ్ఛమైన గాలి నందిస్తున్నాయి. అలాగే కొండలు కోనలు, లెంకలు, వాగులు, అరణ్యాలు ఒక్కటేమిటి 33 కోట్ల జీవరాసులతో నిండివుంది. ఇదంతా మానవ సమాజానికి ఏదో విధాన వుపకరిస్తునేవుంది. అయితే ప్రకృతిలో భాగమైన మానవుడు మాత్రం వుచ్ఛ, నీచ భావాలతో కొట్టుమిట్టాడుతున్నాడు. ప్రేమ, ఆత్మీయతల స్థానే ద్వేషం, జుగుప్స చోటు చేసుకుంటున్నాయి. ప్రకృతిలో ఏది లేకపోయినా మానవ జీవితం దుర్లభం – అలాగే మనం చేసే పనులలో ఏ పని మందగించినా సమాజానికి నష్టమే. అలాంటప్పుడు వాటిపట్ల చిన్న చూపు ఎందుకు ? అది చేస్తున్నామనే చిన్నతనం ఎందుకు ? కించబరుచుకోవట మెందుకు ? మానవ సమాజమంతా శరీరమనుకుంటే .... ఏ అంగం లేకపోయినా జీవితం వ్యర్థమేకదా ! పైనున్న కళ్ళు క్రిందనున్న కాళ్ళను అల్పంగా చూస్తున్నాయా ? కాలి వేలికి దెబ్బ తగిలితె పైనున్న నోరు అమ్మా అని విలపిస్తుందెందుకు ? కళ్ళు నీరు కారుస్తుందెందుకు ? సమాజంలోని వివిధ కులాల వర్గాలమధ్య కూడా యిదే బంధం వుండాలి. అనాదిగా వస్తున్న ఈ బంధం యిటీవలి కాలంలో విడదీయబడి ఒకరొకరు కొట్లాడుకొనే స్థితికొచ్చింది. ఈ స్థితి మారాలి ! సమాజంలోని వివిధ వర్గాల్లో పరమేశ్వరుణ్ణి

( తరువాయి 24 వ పేజీలో )

# పక్షుల పరిశోధకుడు సలీమ్ఆలీ



భారత దేశంలో సుమారు పది వేల రకాల పక్షులున్నాయి. వీటి వివరాలను ప్రపంచానికి చాటి చెప్పిన వ్యక్తి సలీమ్ఆలీ. విశ్వవిద్యాలయాలిచ్చిన డిగ్రీలు లేకపోయినా స్వయంకృషితో ప్రపంచంలోని శాస్త్రజ్ఞులతో సమమైన ఖ్యాతి సంపాదించుకున్నాడు సలీమ్ఆలీ. ఈయనను ప్రపంచంలోని ఎన్నో విశ్వవిద్యాలయాలు గౌరవ డిగ్రీలతో సత్కరించాయి. భారత ప్రభుత్వం పద్మవిభూషణ్ బిరుదుతో సత్కరించటమే కాక, రెండు సంవత్సరాల క్రితం రాజ్యసభ సభ్యుడుగా నామినేట్ చేసింది.

సలీమ్ఆలీ 1896 లో నవంబరు 12 న బొంబాయిలో జన్మించాడు. ఒక పుట్టినరోజున బంధువు ఒకరు బహుమతిగా ఇచ్చిన తుపాకీతో పక్షులను వేటాడేవాడు. వేటాడిన ప్రతి పక్షి వివరాలను వ్రాసుకోవటం ఆయన అలవాటు. అలా ఒకరోజు కాల్చివేసిన పక్షిలో వున్న క్రొత్తరకం లక్షణాలను గమనించటంతో ఆలీలోని పరిశోధకుడు బయట పడ్డాడు.

సుమారు పది సంవత్సరాలపాటు జర్మనీలో శిక్షణ పొంది, తిరిగి వచ్చిన ఆలీ దేశంలోని అప్పటి సంస్థానాధీసుల ఆహ్వానంపై పరిశోధనలు సాగించాడు. 180 పక్షుల వివరణలతో "భారతదేశపు పక్షులు" అనే పుస్తకం ప్రచురించాడు.

ఆ తరువాత మరో పది సంవత్సరాలపాటు విస్తృతంగా పర్యటించి "భారత ఉప ఖండంలో పక్షులు" అనే పేరుతో పది సంపుటాలు వెలువరించాడు. ప్రపంచవ్యాప్తంగా ఈ గ్రంథాలకు విశేష ఆదరణ లభించింది.

ఈ నెలతో తొంభై సంవత్సరాలను పూర్తి చేసుకుంటున్న సలీమ్ఆలీ ఇప్పటికీ పరిశోధనలో లీనమయి వున్నారు. గత నూటఏభై సంవత్సరాలుగా మనుషుల కంట పడకుండా పోయిన 'నేలనెమలి' అనే పక్షి కోసం హిమాలయాల్లో వెతుకుతున్నాడు.

త్రీ చీర్స్ టు దిగ్రాండ్ ఓల్డ్ మాన్ ఆఫ్ ఇండియా.

— డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు



కుల సంస్కృతిని కూల్చేద్దాం (23వ పేజీ తరువాయి)

దర్శించే పరిస్థితి రావాలి. అందుకు మూలమయిన దేశాన్ని, దేశ సంస్కృతిని ప్రేమించగల్గాలి. "స్వధర్మాన్ని ప్రేమించలేనివాడు స్వజాతిని స్వదేశాన్ని ఎలా ప్రేమించగలడు ?" అని అడిగిన బాలగంగాధరతిలక్ మాటలు అందరికీ శిరోధార్యం కాగల్గాలి. ధర్మం పట్ల పవిత్ర భావన అబ్బిననాడు మనోవికాసం కలుగుతుంది. వికసించిన మనస్సు వైవిధ్యంలో ఏకాత్మను దర్శించ గలుగుతుంది. ఏకాత్మ భావన సమాజాన్ని సంఘటిత పరుస్తుంది. సంఘటిత సమాజం కలతలకు దూరమవుతుంది. ఇందుకోసం శ్రమిద్దాం.



# కస్తూరి

జానమద్ది హనుమచ్ఛాస్త్రి

**మానవ** కుటుంబంలో నామ రూపాలలో సామ్యం వుండనే వుంది. అలాగే భాషా కుటుంబంలో కూడా నామ సామ్యత కనిపించడం మనకు వింతగా తోస్తుంది. పగటివేళలకంటే రాత్రిళ్ళు మనలను ఎక్కువగా పీడించే "దోమ" ను సంస్కృతంలో "మశక" అంటారు. అల్పాల్పమైన యీ కీటకం ఆశ్రమాల్లోని మహర్షుల మధ్య చేరి తద్వారా వేదాల్లోకి ప్రాకింది. ఈ "మశకమ్" అంతటితో ఆగిపోక, మస్క్విటో (Mosquito) నామాంతరంతో ఆంగ్ల పదకోశానికెక్కింది. భాషాశాస్త్ర చరిత్రతో కాస్త పరిచయమున్న వారందరికీ మరో సత్యం కనిపిస్తుంది. ఆంగ్ల భాషలోని ముప్పాతిక వంతు పదాలు ఇతర భాషలనుండి సంక్రమించినవే. ఈ "మస్క్విటో" స్పాన్‌ష్, ఫ్రెంచి భాషలనుండి 15 వ శతాబ్దంలో ఆంగ్ల నిఘంటువుల కెక్కింది. అతి ప్రాచీనమైన ల్యాటిన్ భాషలోని "ముస్కా" (Musca) నుండి యీ పదం పుట్టిందంటారు. ఈ విధంగా యీ అల్ప ప్రాణులు సంస్కృత, ల్యాటిన్ భాషలలో దాదాపు ఒకే పేరుతో చలామణి కావటం ఆశ్చర్యం. అంటే మానవులకూ దోమలకూ గల చుట్టరికం చాలా ప్రాచీనమైనదని రూఢిగా చెప్పవచ్చును.

ఈ "మస్క" లేదా "మశక" అన్న పేరుతో పాశ్చాత్య దేశాల్లో "మస్కెట్" అనే మారణాయుధం వెలిసింది. అంటే తుపాకి. ఈ మస్కెట్‌తో కొందరి ప్రాణాలు తీయవచ్చు "మస్క్విటోలు" తలచుకుంటే వేలాది ప్రజలను హతమార్చవచ్చు. ఈ మస్కెట్లు ధరించిన వీరులు "త్రీ మస్కెటీర్స్" గా చరిత్రకెక్కారు.

హిందువులకే కాక జైనులు, చైనీయులకు కూడా అరాధ్యుడైన వినాయకుని వాహనం "మూషికమ్" అంటే ఎలుక. గ్రీక్ భాషలో, మూస్ (Mys) లాటిన్‌లో కూడా మూస్ (Mus) అయిన ఎలుక, ఆంగ్లంలో "మౌస్" (Mouse) అయింది. సంస్కృత భాషీయుల మూష(క) శబ్దం ముష్ (దొంగిలించు) ధాతువు నుండి పుట్టిందనటంలో వాస్తవం లేకపోలేదు. ఈ మూషక సామ్రాజ్యం అంతర్జాతీయంగా విస్తరించిందని జీవశాస్త్రవేత్తలంటున్నారు.

"కొక్కులు" (కాస్త పెద్ద ఎలుకలు) కథ మరో విధం. ఇంగ్లీష్, ఫ్రెంచి, జర్మన్ భాషలలో "కొక్కు" "ర్యాట్" (Rat) గా వ్యవహరింపబడుతున్నది. క్రీ. శ 10 వ శతాబ్దంలో ఉత్తర యూరోపియన్ భాషలైన ఇంగ్లీష్,జర్మన్ మున్నగు భాషల్లో ప్రవేశించిన "ర్యాట్" కాలక్రమంలో ఇతర భాషలను దాచ్చి చివరకు ల్యాటిన్ భాషలోకి అడుగు పెట్టింది.

ద్రావిడ భాషల్లో ఎలుక పలు రకాల పేర్లు సంతరించుకుంది. తుళు భాషలో "పెర్గడే" గా వుండే ఎలుక కన్నడంలో "హెగ్గణ" అయింది. పెర్గడె (కుడె) తుళు భాషలో బొరియలు తోడే పెద్ద ప్రాణి.

తెలుగుభాష నుండి ఆంగ్లేయులు పందికొక్కును సంగ్రహించి ముద్దుగా 'బ్యాండికూట్' అని పేరు పెట్టుకున్నారు చిట్టెలుకలను మాత్రమే అదివరకు చూచిన తెల్ల దొరలు పందుల్లాంటి పందికొక్కులను ప్రప్రథమంగా తెలుగుదేశంలోనే ఎదుర్కొన్నారు కాబోలు. ఈ మహా మూషికం పందిలా గుర్రుమంటుందని గమనించి ఆ పేరు పెట్టి వుంటారు.

'కస్తూరీ తిలకం, లలాట ఫలకే' అంటూ అభినుతింప బడుతున్న మన దేవదేవుడు ధరించే సుగంధ ద్రవ్యం కస్తూరి. అతి విలువైనది. భోగ్యవస్తువు కాబట్టి శ్రీనాథ కవిసార్వభౌముడు కస్తూరీ యుక్త తాంబూ

లానికై అర్రులు చాచే వాడంటారు. ఈ ' కస్తూరి ' ని ఆంగ్లంలో ' మస్క్ ' ( Musk ) అంటారు పొట్టలో కస్తూరిని దాచుకుని హిమాలయ ప్రాంతాల్లో విహరించే కస్తూరీ మృగాల వల్ల లభించే కస్తూరికి దేశ విదేశాల్లో ఎంతో గిరాకీ వుండేది. ఇంగ్లీష్ లోని మస్క్ పారసీ భాషలో ' ముష్క్ ' అయి యూరోప్ దేశాలకు వెళ్ళింది. అరబ్బులు యీ ' కస్తూరి 'ని ముష్క్ అన్న పేరుతో విదేశాల్లో విక్రయించేవారు. సంస్కృత పదమైన ' ముష్క ' ( అండకోశం ) నుండి ' మస్క్ ' పుట్టిందనవచ్చు. కస్తూరీ మృగం యొక్క అండమునుండి లభించినదన్న భ్రమతో యీపేరుపెట్టారేమో.

భారోప్ప జనుల మూల నివాసం గురించి వాదోపవాదాలు యింకా సాగుతూ వున్నాయి. కాని భారతీయులు మొట్టమొదట నెలకొన్న ప్రదేశంలో ఎలుగు, అడవిపంది, తోడేలు వంటి వన్య ప్రాణులుండేవనటంలో సందేహం వుండనక్కరలేదు.

ఎలుగుబంటిని సంస్కృతంలో ' భల్ల ' అంటారు. ఆంగ్లంలో బేర్ ( Bear ) జర్మన్ భాషలో ' బర్ ' డచ్ భాషలో బీర్ ( Beer ) అంటారు. భాషల్లో ర-ల మధ్య వినిమయం సాధారణంగా వుంటుంది. ప్రాక్-ఇండో జర్మన్ భాషలలో ' భేరో 'అంటే గోధుమరంగు ( బ్రౌన్ ) అన్న అర్థమిచ్చే ఎలుగుబంటి రంగు.

తోడేలు సంస్కృతంలో 'వృకం' అయితే ఆంగ్లంలో వుల్ఫ్ ( Wolf ) జర్మన్ భాషలో వోల్ఫ్, ల్యాటిన్‌లో ' లూపస్ ' గ్రీక్ భాషలో లైకస్ ( Lykos ) యీ పదాలన్నీ ' వృక ' పదం యొక్క దాయాది కుటుంబాలకు చెందినవే.

మనం క్షుద్ర జంతువని విశ్వసించే తోడేలు ఒకప్పుడు గౌరవంగా బ్రతికి వుండవచ్చు. అందువల్లనే భీముడు ' వృకోదరుడు ' గా పేరు గాంచాడు. 

## మీకు తెలుసా ?

70 సం॥ పాటు మనిషి జీవించిఉంటే, అతని గుండె 27 కోట్ల శేర్ల రక్తాన్ని 'పంప్' చేస్తుంది. రక్తం గుండె ద్వారా సరఫరా చేయబడి శరీరమంతటా రక్త నాళాలగుండా పయనించి మళ్ళీ గుండె చేరుతుంది. ఇలా చేస్తే వీటి దూరం 70 సం॥ లలో 5 కోట్ల మైళ్ళు. గుండె అదే కాలంలో 290 కోట్ల సార్లు కొట్టుకుంటుంది.

* * *

తుపాకీని పేల్చినప్పుడు అందులోని లోహపుగుండు సెకండుకు 500 గజాలు దూసుకొనిపోతుంది.

* * *

ప్రతి సెకనుకు 65 కోట్ల 50 లక్షల టన్నుల హైడ్రోజన్ 65 కోట్ల టన్నుల హీలియం పదార్థంగా మారుతుంది. మిగిలిన 50 లక్షల టన్నుల హైడ్రోజన్ కాంతిగా మారుతుంది. అదే మనకు కనిపించే సూర్యకాంతి.

* * *

చంద్రుని వ్యాసం 2,059 మైళ్ళు, భూమి వ్యాసం 7,900 మైళ్లు చంద్రుడు భూమి చుట్టూ తిరగడానికి 27 1/3 రోజులు పడుతుంది.

* * *

ప్రపంచంలో అతి చిన్న భగవద్గీత గ్రంథం ముక్త మండల్ ఆశ్రమం స్వామి గంగేశ్వరానంద్ వద్ద ఉంది. అది పదిపైసల నాణెమంత వుంది. దీని విషయం బెర్లిన్ దేశపు సంస్కృత విశ్వవిద్యాలయం బయటకు తెచ్చింది. దీనిని జర్మన్‌లో ప్రచురించారు. గంగేశ్వరానందస్వామి దీనిని చిన్న లాకెట్టులో అమర్చి, చదువుకొనడానికిగాను చిన్న భూతద్దాన్ని అందు అమర్చారు. దీనిలో 15 చిన్న చిన్న బొమ్మలు కూడా ఉన్నాయి.

# పది దేశాల ఎడారి

ఐరోపా ఖండానికి, ఆఫ్రికాకీ మధ్య వున్న సహారా ఎడారి క్రీస్తు పూర్వం వెయ్యి సంవత్సరాల క్రితం అంటే, దాదాపు 2986 సంవత్సరాల క్రితం ఏర్పడిందని అంచనా వేశారు. అంతకు మునుపు, అంటే 5 నుంచి 9 వేల సంవత్సరాలకి పూర్వం మనుష్యులు పంటలు పండిస్తూ అక్కడ నివసించేవారు.

సహారా విస్తీర్ణం 100 కోట్ల హెక్టార్లు. పది దేశాలలో వుంది ఇది. మొరాకో, అల్జీరియా, టునీషియా, లిబ్యా, ఈజిప్ట్, మాలి, నైజర్, చాడ్, సూడాన్, మరిటేనియా దేశాలు ఆ పది.

మల్లాది వెంకటకృష్ణమూర్తి

సహారాలో పెట్రోల్, ఖరీదయిన లోహాలు లభిస్తాయి. లిబ్యాలోని సహారాలో పెట్రోల్ లభ్యమవుతుండటం వల్ల ఆ దేశం ప్రపంచంలోని పెట్రోల్ వెలికి తీసే పదవ పెద్ద దేశంగా పరిగణింపబడుతోంది. అల్జీరియా ఆఫ్రికాలో వెలికి తీసే పెట్రోల్‌లో 20 శాతం ప్రపంచానికి అందిస్తోంది. మేంగనీస్, ఇనుము, రాగి, తగరం, యురేనియం, జిప్సమ్ మొదలయిన లోహాలు కూడా సహారా నేలలో లభ్యమవుతున్నాయి

అల్జీర్స్ నుంచి నైజీరియా దాకా సహారా ఎడారిలో 3,260 కిలోమీటర్ల పొడవుగల రోడ్డు వేయబడింది. ఏర్‌కండిషన్డ్ బస్సులలో సహారా ఎడారిని చూపించే టూరిస్ట్ కంపెనీలు యూరప్‌లోని ఏడు దేశాలనుంచి నవంబర్ నుంచి ఏప్రియల్ నెలదాకా టూర్స్ కండక్ట్ చేస్తున్నారు. ఆ సమయంలో 100 డిగ్రీల ఫారిన్ హీట్ మించి వుండదు ఎడారిలో.

అల్జీరియా ప్రభుత్వం ఒయాసిస్సుల దగ్గర టూరిస్ట్‌ల కోసం హోటళ్ళని కూడా కడుతోంది. చాలాభాగం ఒయాసిస్సులు మనుష్యుల చేత నిర్మితమయినవే. నేలలో బావులు తవ్వి, నీరు వెలికి తీస్తున్నారు. సహారా ఎడారి భూమిలో 1100 కోట్ల క్యూబిక్ మీటర్ల నీరు వుందని అంచనా వేశారు.

ఈ ఎడారిలో 20 లక్షల జనాభా వుంది. అంతా ఒయాసిస్సుల చుట్టుప్రక్కలే నివశిస్తున్నారు. ఖర్జూరపు పళ్ళే వీళ్ళ ముఖ్య ఆహారం. వీటినే ఎగుమతి చేసి వ్యాపారం చేస్తున్నారు. ఒయాసిస్సు పరిణామాన్ని చుట్టుప్రక్కల గల ఖర్జూరపు మొక్కల సంఖ్యతో పోలుస్తారు. జీతాలు ఖర్జూరపు పళ్ళతో చెల్లిస్తారు. ఖర్జూరపు చెట్లు కాక ఈతచెట్లు, గడ్డి, ఫిల్, బోగన్‌విల్లా మొదలయిన చెట్లుంటాయి. 

## అక్టోబరు రంజనిమాల సమాధానాలు

అడ్డము 1. నాగార్జునసాగరు 4. ఉవరము 5. పల్నాడు 6. నాగావళి 8. జయపూరు 10. గౌతమీ గోదావరి 13. కొండవీడు 15. కటారుపల్లి 16. జగ్గయ్యపేట 18 ఓరుగల్లు 20. నర్సాపురము 24. కోలలపూడి 25. కోలారు 26. గుంతకల్లు 27. కొత్తకోట 28. జనగాం.

నిలువు : 1. నాగపట్టణము 2. సారనాథ్ 3. బోరవెల్లి 4. ఉదయగిరి 7. వసిష్టగోదావరి 9. మాడుగుల 11. తళ్ళికోట 12. వజ్రకరూరు 13. కొండపల్లి 14. విజయనగరము 17. పాములవాక 19. గద్వాల 21. సాలూరు 22. గండికోట 23. ఆలూరుకోన

విధి లీలలు చాలా విచిత్రంగా ఉంటాయి - అనుకోవడం మానవ సామాన్య లక్షణం.

కాని లోకంలోని ప్రతి పనీ కార్యకారణ సంబంధంతోనే ముడిపడి వుంటుందనీ, జరిగే ప్రతి కర్మకూ మానవుడి కర్తృత్వ శక్తియే బాధ్యత వహించవలసి వుంటుందనీ నిశిత పరిశీలన నిరూపిస్తుంది. రాజూ-మకరంద్‌ల కథ దాదాపు అలాగే జరిగింది.

రాజు తన పరిశోధనలవల్ల ఒక కొత్త ఆయింట్‌మెంట్ కనిపెట్టాడు. దాన్ని పేటెంట్‌గా తానే పంపిణీచేసే ఒక సంస్థను స్థాపించాడు. దానికి రిజిష్టర్డ్ ట్రేడ్‌మార్క్ వగైరా అన్నీ ఏర్పాటు చేసుకున్నాడు. అది చూస్తుండగానే ప్రజాదరణను పొందింది. ఇలావుండగా ఒకనాడు నారాయణగూడా తాజ్‌లో నరసింగరావు కాఫీ తాగుతూ కూర్చొనివున్నాడు. అదే సమయానికి శ్యాం అయ్యంగార్ కూడా వచ్చాడు. 'రండి - రండి' రావు శ్యాంను ఆహ్వానించాడు.

## డాక్టర్ ముదిగొండ శివప్రసాద్




# హ్యూమానిటీ ఫర్ సేల్

శ్యాం వచ్చి నరసింగరావుకు దగ్గరగా కూర్చున్నాడు. వచ్చిన సర్వర్‌కు మసాలా దోశె ఆర్డరిచ్చి బాతాఖానీలో పడ్డాడు శ్యాం- ఆ మాటా ఈ మాటా వచ్చి రాజు కని పెట్టిన ఆయింట్‌మెంట్ ప్రసక్తి వచ్చింది-

" బొంబాయి కంపెనీ వారి ఆయింటుమెంటుకు ఇది డూప్లికేటులా వుంది- "

ఉలిక్కి పడ్డాడు శ్యాం-

" ఆ సైజూ పేరు పెట్టడం కూడా సరిగ్గా దానికి ఇమిటేషన్ లాగే వుంది- "

ఇక నరసింగరావుతో మాట్లాడ బుద్ధి పుట్టలేదు శ్యాముకు. ఎలాగో దోసె తిని వస్తానని కూడా చెప్పకుండా లేచి ఇవతల పడ్డాడు. సరిగ్గా వారంకూడా తిరగక ముందే బొంబాయి కంపెనీ వారినుండి రాజుకు కోర్టు నోటీసు వచ్చింది తమ జగద్వ్యాప్తమైన మందును అవమానపరచి వ్యాపారార్థం ఇమిటేషన్‌తో చౌకరకం సరుకును ప్రజానీకానికి అమ్మజూపుతున్నందుకు గాను నష్టపరిహారం చెల్లించి ఆ పేరూ, సైజూ రిజిష్టర్డు ట్రేడ్‌మార్క్ మార్చుకోవలసిందిగా ఆ కంపెనీ వారు ఆదేశించారు. రాజు దెబ్బకు భయపడిపోయి లాయర్ని సంప్రదించాడు.

ఆయన పరిశీలించి ' దావా నడుపుతామంటే నాకభ్యంతరం లేదు కాని అంతిమ విజయం ఎలావుంటుందో తెలియదు ' అని అనుమానంగా చెప్పాడు. నోరుమూసుకొని బొంబాయి కంపెనీ వాళ్ళకు తగిన నష్టపరిహారం చెల్లించి తన మందు పేరూ వగైరా అన్నీ మార్చుకున్నాడు- " నీవు కోర్టుకెక్కితే ఇంకా చాలా నష్టపోయే వాడివి- అలాకాక ఉచిత సలహా ఇచ్చి నిన్ను రక్షించి నందుకు గాను నా ఫీజు కూడా చెల్లించు " అని ఆతని వ్యాజ్యానికి ఫీజు తీసుకుని చక్కాపోయాడు లాయరు నల్లకోటును సవరించుకుంటూ

" ఇదంతా ఆ మకరంద్ చేసిన పని- నాకు రూఢిగా తెలుసు " శ్యాం అయ్యంగార్ మండిపడుతూ అన్నాడు.

" ఆరోజు హోటల్లో నరసింగరావు వెక్కిరించి నప్పుడే అనుకున్నాను- ప్రొఫెషనల్ జలసీతో విషం కక్కుతున్నాడురా అని- వీళ్ళే ఆ బొంబాయి వాళ్ళకు వ్రాశారు- వీళ్ళే మన నిట్లా నష్టంపాలు చేశారు- "

ఇదెంతవరకు నిజం? మకరంద్ బొంబాయికి ఈమందు గూర్చి వ్రాశాడా? ప్రొఫెషనల్‌గా రాజుకూ, మకరంద్‌కూ పోటీ నడుస్తున్నదా? అసలు రాజు మనస్సులో ఈ మందుకు ఈ పేరు పెట్టడంలో దాన్ని స్ఫురింపజేయాలనే ఉద్దేశమే లేదా ? ? ఎవరు చెప్పగలరు ? ?

" కర్మ- ఏం చేస్తాం " అన్నాడు రాజు కోపంగా- అయితే ఈ స్వయం కృతాపరాధ కర్మం ఇంతటితో పోలేదు. రాజుకు వైద్యవృత్తిమీద ఎప్పుడూ విశ్వాసం లేదు. కేవలం ఇదొక గ్లామర్‌తో నడుస్తున్నదనీ సినీతార భవిష్యత్తులా ఏ క్షణాన నైనా ఇది నశించవచ్చుననీ ఆయన భావం. అందుకే సైడు బిజినెస్‌గా మలక్‌పేట కవతలా, సైదాబాదు కాలనీవద్దా, నాగార్జునసాగర్ రోడ్డు మీదా యాదగిరిగుట్ట వైపు ఘటకేసర్ దగ్గరా ప్లాట్లు కొనడం అమ్మడం ప్రారంభించాడు. అందులో కలిసి వచ్చింది. వెంటనే యువతీమండలి దగ్గర ఓ హోటలూ లాడ్జి ప్రారంభించాడు. అదీ కలిసి వచ్చింది. హోటలును ఇంకా విస్తరింప జేశాడు. రాజు కొత్తగా కనిపెట్టిన మందు బహుళార్థ సాధకంగా ఎన్నోరకాల పనిజేస్తుందని

---

( జరిగిన కథ )

డా॥ రాజు కూతురు రాణి, రవి అనే యువ కుడ్ని ప్రేమిస్తుంది. శ్యాం ట్రీట్ చేసిన యాదగిరికి బాగా సీరియస్ కావటంతో పోచయ్య తండ్రిని డా॥ రాజు దగ్గరికి తీసుకొస్తాడు. శ్యాం కూడా యాదగిరి పరిస్థితి సీరియస్‌గా వుండటం గమనించి డా॥ రాజుని పిలుద్దామనుకుంటే ప్రయివేటు రూమ్‌లో లతతో మాట్లాడుతుంటాడు. హేళనగా మాట్లాడి యాదగిరిని, పోచయ్యని పంపేస్తాడు శ్యాం. వాళ్ళు డా॥ మకరంద్ దగ్గరికి వెళ్తారు. మకరంద్ యాదగిరిని ప్రమాదం నుంచి అతి ప్రయత్నంమీద రక్షించకలుగుతాడు. పోచయ్య మనస్సు మాత్రం రాజు, శ్యాంల యెడల విషాన్ని కక్కుతుంటుంది.

( ఇక చదవండి )

---

వుంది ప్రకటనలో. తల తిరుగుడుకూ, వాంతులకూ, కడుపునొప్పికీ కూడా పనిచేస్తుందని ప్రచారం చేయించాడు రాజు. విచిత్రమేమో తెలియదుగాని రాజు పెట్టిన " రాణీ విహార్ " హోటల్లో భోంచేసిన ప్రతివాడూ రాజుగారి మందుసీసా ఒకటి కొనుక్కొని బయటపడేవాడు. ఒక రోజున పోచయ్య పూర్తిగా బజారున పడి నానారభసా చేశాడు " ఈ రాజుగాడు హోటలు పెట్టింది ఫలహారాలు అమ్మడం కోసం కాక మందులు అమ్ముకోవడం కోసమేనని- దీనివల్ల రాజుకు వ్యాపారం పైసలూ మాట ఏమైనా చాలా చెడ్డపేరు వచ్చింది పులిమీద పుట్ర అన్నట్లు ఇంకో ప్రమాదం ముంచుకొచ్చింది- రాణీ విహార్ చాలా గొప్పహోటలనీ సినీతారలు కూడా ఇక్కడ దిగుతూంటారనీ వదంతి వ్యాపించింది. నిజంగానే దిగుతారా ? ? అయితే ఎవరు ? హిందీవాళ్ళా ? తెలుగువాళ్ళా ?

ఇలా చర్చలు ప్రారంభమైనాయి– "అంతా అబద్ధం. హోటల్ గ్లామర్ పెంచుకునేందుకు రాజు పన్నుతున్న నాటకం" అని మరోవర్గం ప్రచారం ప్రచారాలు వాదోపవాదాలు ఇలా జరుగుతూ వుండగా ఉన్నట్లుండి ఒక రోజున పోలీసులు ఈ లాడ్జిమీద ఆకస్మికంగా దాడిచేసి కొందరిని అరెస్టు చేశారు. వాళ్ళు హుస్సేనియా అలయం కమాన్, బంజారాహిల్స్‌కు చెందిన వేశ్యలు. వాళ్ళమీద చార్జిషీటు దాఖలు చేయడం మిగిలిన తతంగం అంతా నడిచింది–దీనివల్ల రాణీ విహార్‌కు ఎంతో అప్రతిష్ట వచ్చింది– "ఈ వ్యాపారంకూడా రాజుగారి మందుల వ్యాపారానికి ఒక సాధకమే. వాడు సెక్సు స్పెషలిష్టు అని బోర్డు పెట్టుకున్నాడు. ముందు ఇలా రోగాలను తానే వాప్తి చేయించి మళ్ళీ తానే వాటికి చికిత్స చేయడం– అటూఇటూ రెండువైపులా డబ్బు గుంజడం – ఇదీ బిజినెస్" అని రాజుపై అభాండాలు ప్రారంభమైనాయి.

పోచయ్య నారాయణగూడా వద్దా, నల్లకుంట కోరంటీ ముందూ కాచిగూడా చౌరాస్తా, దగ్గరా, వై. యం. సి. ఏ దగ్గరా ఇలా అవాకులూ చవాకులూ వాగడం శ్యామయ్యంగార్ దృష్టికి వచ్చింది – తానే స్వయంగా ఒకసారి విన్నాడు కూడా – "ఇదంతా కూడా మకరంద్‌గాడి పనే. వాడు కావాలని మనల్ని బదనామ్ చేస్తున్నాడు. పని కట్టుకొని దుష్ప్రచారం సాగిస్తున్నాడు. వృత్తిరీత్యా స్పర్థను పెంచుకున్నాడు" అని శ్యాం రాజుతో చెప్పాడు– రాజుకూ ఇది నిజమేననిపించింది.

"వాడి అంతు చూస్తేనే కాని నే నూరుకోను" రాజు ప్రతిజ్ఞ పట్టాడు.

నిజంగా ఇదంతా మకరందే చేశాడా ?

తను కావాలని చేసిన తప్పులు ఉన్నాయా ? లేవా ?

ఎక్కడో ఏదో జరిగితే దాన్నంతా మకరంద్ పైకి నెట్టడం కేవలం అతనిమీద తనకున్న కక్షకు కారణం వెతకడంగా మాత్రమే కాదా ? ఇలా రాజు ఆలోచించి ఉండడా ?

ఆలోచించే వుంటాడు –

కాని మకరంద్‌పైన రాజుకు ద్వేషం పుట్టుకొచ్చింది. ఆ ద్వేషాన్ని బలపరచుకొనేందుకు కొన్ని నాసిరకమైన సంఘటనలు రావాలి. రాకపోతే కల్పించాలి. ఇప్పుడు కల్పించ నక్కరలేకుండానే వచ్చాయి. రాజు స్వంత విషయం ప్రతి దాన్లోనూ మకరంద్ జోక్యం కలుగజేసుకుంటున్నాడు. కాబట్టి మకరంద్‌ను అప్రతిష్ఠపాలు చేయాలి.

వాడికి వైద్యమే రాదని నిరూపించాలి.

వాడి ప్రతి స్వంత విషయాన్ని బజారుకెక్కించాలి. నాటినుండి శ్యామయ్యంగారికి వివిధ కార్యక్రమాలతోబాటు ఇదీ ఒక పని – వచ్చిన ప్రతివాడితోనూ మకరంద్ అసమర్థత గూర్చి ప్రచారం చేయడం –

మకరంద్ దొంగ

లోగడ చాలా సర్కారీ దవాఖానాలల్లో పని చేశిండు. కాని మందులన్నీ దొంగచాటుగా అమ్ముకొని పట్టుబడిండు. అందుకని పై అధికారులు డిస్మిస్ చేసిన్రు– ఇదొక కథనం–

మకరంద్ సూది పొడిస్తే చాలు మనుషులు నేరుగా అంబరుపేట పోతారు (స్మశాన స్థలం)– గత సంవత్సరం అంబరుపేట శవాల్లో సగానికిపైగా మకరంద్ దగ్గర మందులు తీసుకున్న వాళ్ళవే వున్నాయి. ఇతనికి వైద్యం రాదు. ఆ వృత్తిమీద గౌరవము లేదు. ఇది ఇంకో ప్రచారం–

మకరంద్‌కు వైద్యం సైడ్ బిజినెస్. దీని వెనుక చాలా రహస్య కార్య కలాపాలున్నాయి. హైదరాబాద్‌లోని వివిధ వర్గాలకు చెందిన సుందరీమణులను ఈ రకంగా ఆకర్షించడం ఆయన లక్ష్యం– అందుకని మకరంద్‌ను చాలామంది చాలాసార్లు తన్నారు. ఒకసారి తంతే (ఎవరో ?) నెల వరకూ మంచం నుండీ లేవలేదు– ఇది మరో పుకారు. "వైద్య శాలల స్థానంలో వ్యాయామశాలలు పెంచడం జాతి సమస్యలకు పరిష్కారం" అని మకరంద్ చేసిన ఒక సభలోని ప్రసంగం పేపర్ కటింగ్– ఇలాంటి వాడు వస్తాడు అవుతాడు కాని డాక్టరెలా అవుతాడు ? ?

(సశేషం)

# పాండవుల ప్రయాణం

ధృతరాష్ట్రుడు మహారాజు. అంచేత సముచితమైన చతురంగ బలంతోనే ఆయనను దర్శించాలని ధర్మరాజు నిశ్చయించాడు. తమతో స్త్రీ జనమూ వస్తారు. వారికి పాట బండ్లనూ, పల్లకీలను సిద్ధపరచాలి. ఆ వృద్ధరాజును చూడగోరే పౌరులందరూ కూడా తమతో రావాలనే ధర్మరాజు అభిమతం. వారిని సురక్షితంగా తమతో తీసుకొని వెళ్ళడానికి, వారి యోగ క్షేమాలను విచారించడానికి, సమర్థులైన వారిని నియమించాలి. బండ్లతో, డేరాలతో, రక రకాలైన భోజన పదార్థాలతో తమ ననుసరించి రావడానికి నిపుణులైన పరిచారకు లవసరమవుతారు. ఈ పనులన్నింటికీ తగిన వారిని నియోగించమని ధర్మరాజు సేనాపతులతో చెప్పాడు. "రేపే ప్రయాణం" అని చాటించ మన్నాడు.

మరునాడు ధర్మరాజు యుయుత్సుని పిలిచాడు; కృపాచార్యుని, ధౌమ్యుని రావించాడు. "మీరిక్కడ పుర రక్షణానికి నిలిచిపోవాలి." అని మృదువుగా శాసించాడు.

గజ బలంతో నీవు బయలుదేరాలని భీమునితో చెప్పాడు. "ఓ అర్జునా! నీవు రథాలతో రావయ్యా! నకులా గుఱ్ఱపుబలంతో నీవు బయలు దేరాలి. సహదేవా, నీవు కాల్బలంతో రావడం సముచితంగా ఉంటుంది!" అని నియోగించాడు. వారందరూ వాద్య ఘోషలతో, ఛత్రాల, జండాల రత్న కాంతులు నింగిని నిండగా, మహావైభవోపేతంగా బయలుదేరారు. ద్రౌపదీ ప్రముఖులైన స్త్రీ జనానికీ, మిగత భరత భార్యలకూ, అంతఃపురాధికారులు అందలాలనూ, పాటబండ్లనూ సమకూర్చారు.

ముత్యాల గొడుగులతో మెరిసిపోతూ, నీల వాలము లున్న పదునారు శ్వేతాశ్వాలను పూన్చిన రథాన్ని ధర్మరాజు అధిరోహించాడు. వేణు వీణారవంతో, వివిధ గాయకులగానంతో, వంది బృందాల వాక్యాలతో, దిశలన్నీ మంగళ ఘోషలతో నిండిపోయాయి.

వివిధ వాహనారూఢులైన పౌరులు ధర్మరాజు వెంట పయనాన్ని సాగించారు. అందరూ గంగానదిని దాటారు. కురుక్షేత్రాన్ని ప్రవేశించారు.

ఇంతలో ఎరిగినవారు శతయూపముని ఆశ్రమాన్ని, దానికి సమీపంలో ధృతరాష్ట్రుని ఆశ్రమాన్ని గుర్తుపట్టారు. పాండవులందరూ తమ తమ వాహనాల నుంచి దిగారు. అభిజనులూ, పురజనులూ వారిని అనుసరించి వస్తూండగా, పాండవులు పాదచారులై ఆతురతతో ఆ వృద్ధరాజు ఆశ్రమాన్ని సమీపించారు. అక్కడి జనులను రుద్ధమైన కంఠంతో ధర్మరాజు, "మా అయ్యయేడీ!" అని అడిగాడు.

వడలి మందేశ్వరరావు

"యమునా నదిలో స్నానానికీ, పుష్పాలను, జలాన్ని సంగ్రహించడానికీ, ఇలాగే వెళ్ళాడాయన." అని అక్కడి జనులు చెప్పగా, పాండవులు వారు చెప్పిన మార్గాన వెడుతూండగా, ఎదురుగా వచ్చే ధృతరాష్ట్రాదిగా గల వారందరూ వారికి కనబడ్డారు.

దూరానఉన్న తల్లిని చూచాడు సహదేవుడు. అన్నలందరినీ గడచి ఒక్క పరుగున వెళ్ళి తల్లి కాళ్ళమీద పడి వెక్కి వెక్కి యేడ్చాడు. కుంతి కూడా ఏడ్పును దిగమ్రింగుకుంటూనే, అతనిని ఎత్తి కౌగిట చేర్చి, "వీడు నా పిన్న కొడుకు, సహదేవు" డని గాంధారితో చెప్పింది.

సహదేవుడు తన కడుపున పుట్టిన బిడ్డ కాడు. అయినా మాద్రి భర్తతో సహగమనం చేయగా, నకుల సహదేవుల

నతి గారాబంగా పెంచింది కుంతి. పాండవులందరూ ఒకరికంటె ఒకరు ఒక్కొక్కరే చిన్నవారయినా, కుంతి కంటికి ధర్మరాజు ఎప్పుడూ ప్రాజ్ఞునిలాగా, సహదేవుడు పసిబిడ్డ లాగా, కనబడతారు. పాండవులు వనవాసానికి వెడుతూంటే, కుంతికి బెంగ అంతా సహదేవుణ్ణి గురించే. అంచేతనే వీణ్ణి జాగ్రత్తగా చూసుకోమని ద్రౌపదికి అప్ప చెపుతూ :

" కడుఁ బసిబిడ్డ వీఁ డొకటి కా దపునా నెఱుఁగండు ముందరె
య్యెడ నొక పా టెఱుంగఁ డెద యెంతయుఁ గోమల మెప్పుడైన నేఁ
గుడువఁగ బిల్తుఁగాని తనకుంగల యాకఁటి ప్రొద్దెఱుంగఁ డీ
కొడు కిటు పోకకున్ మనము గుందెడు నిన్ గని యూఱడిల్లెడున్ "

విరాట : 2-213

అని అంటుంది కుంతి.

అందుకే కుంతికై సహదేవుడంత బెంగటిల్లి పోయాడు. ఆమె కనబడగానే పరిగెత్తుకొని వెళ్ళి ఆమె పాదాలమీద వ్రాలాడు.

ఇంతలో మిగతా పాండవులూ అక్కడకు చేరుకున్నారు. ఇదిగో వీరు, వీరు వచ్చారని అక్కడి వారు ధృతరాష్ట్రునికీ గాంధారికీ ఎరుకపరచారు. పాండవులందరూ తల్లి పాదాలకు నమస్కరించగా, కుంతి కన్నీళ్ళతో కరిగిపోతూ వారి కన్నీళ్ళు తుడుస్తూ వారందరినీ కౌగిటపట్టింది.

మహారాజు సమక్షాన మెలగడ మెలాగో తెలిసిన లోకజ్ఞుడు సంజయుడు. అతడు తన చూపులతోనే పాండవులను పలకరించాడు. ఆ చూపుల్లోనే ధర్మరాజు పట్ల తన వినయాన్ని, భీమాదుల పట్ల గౌరవాదరాలను ప్రకటించాడు.

ఇతర స్త్రీజనమూ వచ్చి ఆ కురువృద్ధునూ, గాంధారినీ, కుంతినీ కలిసికొన్నారు. ఆ వృద్ధుల చేతనున్న జలకలశాలను ఇలా ఇవ్వండని పాండుపుత్రులు అడిగి తీసుకొన్నారు. తమను అలా అనుసరించి వస్తూఉన్న పాండవులను చూస్తే, హస్తినాపురంలో ఉన్నరోజులు తిరిగి వచ్చినట్లనిపించింది ఆ వృద్ధరాజుకు !

ఆశ్రమానికి అందరూ వచ్చేసరికి, ఆశ్రమం కలకలలాడిపోయింది. సమస్త బంధుజనంతో ఆశ్రమ స్థలం నక్షత్రాలతో శోభిల్లే గగన తలంలా ఉండగా, తాను, ఆ కురురాజు నిండు చంద్రునిలా మెరిసి పోయాడు. ఆ చేరువ తాపసులందరూ, వచ్చిన రాజులనూ, రాజబంధువులనూ చూడ నభిలషించి రాగా, వారి నందరినీ పాండవులు సవినయంగా ప్రణామములతో ఆహ్వానించి, తగిన ఆసనాలను అమర్చారు. తాము ధృతరాష్ట్రుని పరివేష్టించి ఉన్నారు. వనితా జనం అంతా తగు విధంగా నిలబడి ఉన్నారు.

వచ్చిన మునులు సంజయునితో వీరెవ్వ రెవ్వరో తెలియపరచ మని కోరారు. అతడు వారికి ఒక్కొక్కరినీ ఎరుకపరచాడు.

" ఓ మహర్షులారా ! బంగారు చాయతో, పలుచని దీర్ఘమైన మేనూ, చెలువారే నాసికా, విశాల నేత్రములు కల్గిఉండి సింహ రేఖతో కనులకు పట్టారానంతటి ఈ మహా తేజస్వి ధర్మరాజు.

" కడు నెట్టివైన భుజాలతో పెద్దపెద్ద చేతులతో, విశాలమైన వక్షంతో శోభిల్లే ఈయన భీముడు.

" ఈయన్ను చూసారుకదా ! ఈ ఉజ్జ్వల సుందరమైన ఈయన నల్లటి శరీరం వారణేంద్రుని తలపించగా, కన్నుల కాంతి కలువల్ని జ్ఞప్తికి తెస్తుంది. ఈయనే అర్జునుడు.

" చూచారా ! కుంతికి ఇరుప్రక్కలా ఇంద్రునిలా, ఉపేంద్రునిలా ఇద్దరు కూర్చున్నారు. తమ కెందునా అందంలో సాటి గలవారు లేరన్నట్టుగా కనబడే వీరు, మహా వినయ భూషితులు, నకుల సహదేవులు !

" నల్లకలువల చాయగల మేను; నవ పద్మదళాలను తిరస్కరించే మెరిసే కండ్లు; మధ్యత్వమున ప్రవేశించే

ప్రాయంతో, సహజ సౌందర్యంతో, భాగ్యాల రాశిగా కన బడే ఈమె పాంచాలి. ఆమె ప్రక్కనే ఎఱ్ఱని మేనుతో, ఉజ్జ్వలాకృతితో మెరిసిపోయే పద్మముఖి సాక్షాత్తూ నారాయణుని చెలియలు, సుభద్ర, అర్జునుని వల్లభ!

"వీరి ప్రక్కనే మేలిమి బంగారు బొమ్మలా ఉన్న ఈమె ఉరగరాజు కూతురు, ఉలూపి; ఆ ప్రక్క గౌర వర్ణముతో నున్న ఆమె పాండ్యరాజ సుత చిత్రాంగద. ఈ ఇర్వురూ కూడా అర్జునుని భార్యలే!"

"నల్ల కలువ చాయతో నున్న ఈమె భీముని భార్య. గౌరాంగి అయిన ఆమె సహదేవుని గృహిణి. 'మేచక నవ కువలయ' వర్ణానికి సరివచ్చే కాంతి గల యీమె సహదేవుని తరుణి."

"వారి ప్రక్క పాపటలు లేక తెల్లటి చీరలతో నున్న వారంతా ఉపపాండవుల కోడండ్రు. వారిలాగే ఉండి, సుభద్ర నానుకుని ఉన్న ఆమె- ద్రోణుడు, కర్ణుడు మొదలైన కురువీరుల ధైర్యాన్ని హరింపచేసి, తెగిన-మహావీరుడు అభిమన్యుని ప్రియ, ఉత్తర!"

* * *

సంజయుడు మునులకు నిజానికి ఎవ్వరినీ పరిచయం చేయలేదు. పరిచయం చేయడ మంటే ఒక్కొక్కరిలోని వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించి చూపాలి. అది వారి శీలానికి కాని, సాధించిన విజయానికి కాని, పొందిన పరాజయానికి కాని సంబంధించి ఉండాలి. ఇలా పరిచయం చేయడంలో భారత కవులు ఘటికులు. ఎఱ్ఱన నిర్వహించిన అరణ్యపర్వంలో సైంధవుడు ద్రౌపదిని బలాత్కారంగా ఎత్తుకుని పోతూంటే, వానిని వెన్నంటి పాండవులు వచ్చారు. "నీ కింక మూడిం" దని ద్రౌపది ధర్మరాజాదులను గురించి సైంధవునితో చెపుతుంది. అందులో ధర్మరాజును గురించి ఏ మన్నదో గమనించండి:

## కన్నీళ్ళు

పుడిసెడు కన్నీళ్ళే
పుట్టెడు దుఃఖభారాన్ని దించేస్తాయి.
మేలు చేశామని తిరిగి
మామూలు మనుషుల్లా దెప్పి పొడవవు.
గోడుగోడున విలపించే ఒంటరి ఆత్మకు
తోడు నిలిచే నిజమైన స్నేహితులవి.
ప్రతిఫల మాశించని స్వచ్ఛంద సేవకులవి.

— కమల్

"తను వృత్తాంగుఁడు శుద్ధ కాంచన సముద్యద్వర్ణుఁ డభ్యుల స
ద్వన జాతీయత చారులోచనుఁడు దివ్యద్యూరి తేజో ఘనుం
డనఘుం డల్ల రథంబుపై వెలుఁగు పుణ్యాత్ముండు ధర్మాత్మజుం
డనిరోధ ప్రతిభా ప్రబోధ నిధిఁ యత్యాశ్చర్య శౌర్యుం డనిన్.

"కురుకుల శేఖరుండతఁడు ఘోర రణంబుల నెట్టి శత్రులున్
శరణని సొచ్చిరేని విలసత్కరుణా మతిఁ గాచు!"

— అరణ్య: 6-207, 208

ఇదీ ధర్మరాజు వ్యక్తిత్వాన్ని చూపడమంటే. ఇలా చెప్పడం అక్కడ అవసరం. కాని ఇక్కడ సంజయుడు చేయవలసిన పని అది గాదు. అతడు ఇక్కడ వంది కా నవసరం లేదు. ఆ మునులు వారి పేర్లూ, ప్రతిష్ఠా వినే ఉన్నారు. అందుచేత ఎవరెవ్వరో చూపడమే సంజయుడు చేయవలసిన పని. అదే చేసాడు సంజయుడు. ఔచిత్యాన్నే కాకుండా, సంయమాన్ని కూడా ఎరిగిన కథకుడు తిక్కన!

(సశేషం)

# మన కళారంగం

**మానవ** జీవితంలో అనేక రంగాలు. కొన్ని ప్రాముఖ్యం గలవి, మరికొన్ని ప్రాముఖ్యం లేనివి.

సాంస్కృతిక రంగం చెందుతుంది మొదటిదానికి. సాంస్కృతిక రంగపు అభావంలో మానవ జీవితంలోవి మిగతా రంగాలేవీ రాణించవు.

ఆ సాంస్కృతిక రంగానికే చెందుతుంది కళారంగం.

కళారంగం పొడవైంది, వెడల్పయింది, ఎత్తయింది, లోతైంది. అయినా, పొడవులేని, వెడల్పులేని, ఎత్తు లేని, లోతులేని కళా సృష్టికూడా జరుగుతుంటుంది అన్ని దేశాల్లోను, అన్ని కాలాల్లోను.

## డాక్టర్ సంజీవదేవ్

మానవ సంస్కృతిలో ప్రతిభా విస్మృతిభా కూడ సమాంతరాళ రేఖలవలె ప్రవహిస్తూనే ఉంటాయి వెలుగు చీకట్లుగా.

అందువల్ల కళారంగం ఓసారి కళ తప్పటం, తప్ప కుండా ఉండటం కూడ జరుగుతుంటుంది. తప్పకుండా ఉండటం ఎక్కువగా, తప్పటం తక్కువగా జరుగు తుంటుంది.

పై సత్యం ఒక కళారంగానికే కాదు, మానవజీవి తపు అన్ని రంగాలకూ సమానంగా వర్తిస్తుంది. అసలు అది మానవ జీవితానికే వర్తించినపుడు జీవితంలోని ఒక ప్రముఖభాగమైన కళారంగానికెందుకు వర్తించదు ?

కళారంగం అనగానే ఏ కళారంగం అనే పశ్న లేస్తుంది సాహిత్యరంగమా, సంగీతరంగమా, చిత్ర, శిల్ప రంగాలా, నాటక, నృత్యరంగాలా అని. ఇవేకాదు, ఇంకెన్నో ఉన్నాయి కళా రంగాలు.

కనుక కళారంగం అన్నపుడు ఈకళలన్నిటికీ సంబంధి స్తుంది. వీటిలో కొన్ని సృజనాత్మక కళలు (Creative arts), మరికొన్ని ప్రదర్శనాత్మక కళలు (Performing arts). సంగీతం, నాటకం, నృత్యం మొదలైనవి ప్రద ర్శన కళలు; సాహిత్యం, శిల్పం, చిత్రం, వాస్తు మొదలైనవి సృజనాత్మక కళలు.

మిగతా కళాకారులను కళాకారులు అంటారు కాని సాహిత్యకారులను కళాకారులనరు. ఇందుకు ప్రధాన కారణం, సాహిత్యం మిగతా కళలకంటే ఎక్కువ భాగం మనసుకు సంబంధించింది. మిగతా కళల్లో నిర్మాణ శిల్పం ప్రధానం, సాహిత్యంలో ప్రధానం భావాభివ్యక్తి. ఒక్క మాటలో చెప్పాలంటే మిగతా కళలది ఎక్కువగా సంవేద (Sensation), సాహిత్యానిది భావన (Ideation)

ఇతర కళల్లో విషయ వస్తువును తొలిగించినాకూడ రూపం మిగులుతుంది. సాహిత్యంలో ఎక్కడోకాని, ఎప్పుడోకాని ఆ విధంగా కుదరదు.

అందుకే కాబోలు ప్లేటో మహాశయుడు తన రిపబ్లిక్ లో కవికిచ్చిన స్థానం మరో కళాకారునికివ్వలేదు, కవి కూడ కళాకారుడే అయినప్పటికీ.

ఆంధ్ర ప్రదేశ్‌లోని కళారంగం ఎక్కువ భాగం ప్రద ర్శన కళలకే చెందిఉంటుంది. తక్కువభాగం సృజనాత్మక కళలకు. ప్రాచీనాంధ్రలో అవీ ఇవీ అన్నీ సరిసమానంగానే ఉండేవి.

నేడు ప్రజల్లో నృత్యకళమీద కనిపించే వ్యామోహం చిత్రకళమీద కనిపించదు. నృత్య ప్రదర్శనానికి హాజ రైనంతమంది ప్రేక్షకులు చిత్రప్రదర్శనాలకు హాజరుకారు.

నృత్య కళలో ప్రదర్శించబడేది సజీవ మానవులు, చిత్రకళలోది కదలని మెదలని రంగులరూపాలు, రూపాల రంగులు.

ప్రదర్శనాత్మక కళలు వ్యాప్తిచెందటం అవాంఛనీయం కాదు, కాని వాటితో పాటు సృజనాత్మక కళలు కూడా వ్యాప్తి చెందాలని.

అన్ని కళల్లోకి నేడు సాహిత్యకళ అధికంగా పెరుగుతుందనేది నిజం. ప్రత్యేకించి కల్పనా సాహిత్యరంగం సారంలో కంటే సంఖ్యలో బాగా పెరుగుతూంది. కల్పనా సాహిత్యంలో కొందరి రచనలు కాంతిమంతంగా వెలుగుతుంటే మరికొందరివి మసకగా ఉంటున్నాయి. నవలల కంటే కథానికలు ఎక్కువ కౌశలాన్ని ప్రదర్శిస్తున్నాయి. నేడు వెలువడుతున్న మినీ కవితలు అదో రీతిలో ఆకర్షకంగా ఉంటున్నాయి.

కవితారంగంలో వచన కవితలూ, ఇటీవల ప్రవేశించిన మినీ కవితలూ ఒక విశిష్ట అభివ్యక్తితో రాణిస్తున్నాయి. ఆధునిక కవితలో కొంత అస్పష్టత ఉంటుందనేది అసత్యం కాదు. కవితలో అటువంటి అస్పష్టత పూర్తిగా కాకపోయినా కొంతయినా ఉండటం శోభనిస్తుంది.

ఆధునిక సాహిత్యంలోని వీటన్నిటినీ గమనిస్తే మన సాహిత్య కళారంగం కళతప్పటం లేదని విశదమవుతుంది.

ఇక సంగీత రంగాన్ని తీసుకుంటే, ఒక వైపున శాస్త్రీయ సంగీతం విస్తరిస్తున్నట్లే మరోవైపున లలిత సంగీతం, జానపద సంగీతం కూడ వికసిస్తున్నాయి. నూతనంగా కర్ణాటక సంగీతం మాత్రమే కాకుండా హిందుస్తానీ సంగీతం కూడ ప్రజాదరణను పొందుతూంది.

గాత్ర సంగీతం ఎంతగా పెరుగుతూందో అంతగా పెరుగుతూంది జంత సంగీతం కూడ. వీణావాదన, వైలిన్ మృదంగం, ఘటవాద్యం మొదలగు తాళవాద్యాలు కూడ, తగినంత వికాసం చెందుతున్నాయి. ఈ రంగంలో కొందరు లేత వయస్సువారు ప్రదర్శిస్తున్న దక్షత శ్లాఘనీయం.

నేటి రంగస్థలంలో కూడ యువ నటీనటులు, నవ నటీనటులు ఎన్నో నవ్య ప్రక్రియలను ప్రవేశపెట్టి సామాజిక చైతన్యాన్ని దృష్టిలో ఉంచుకొని ప్రేక్షకులను రంజింప చేస్తున్నారు. సమాజ ప్రగతికి ప్రేరణ కల్గిస్తున్నారు.

నాటకం కంటే నాటిక నేడు ఎక్కువ ప్రాబల్యాన్ని అందుకొంటుంది. రంగస్థలం మీద ప్రదర్శితమయ్యే దృశ్యనాటికలేకాక రేడియోద్వారా ప్రదర్శితమయ్యే శ్రవ్య నాటికలు కూడ ఇతివృత్తంలోను రచనా శిల్పంలోను కమనీయంగా రూపొందుతున్నాయి.

ప్రదర్శనాత్మక కళల్లో అన్నిటికంటే నర్తనకళ విశిష్టంగా పెరుగుతూంది. ఈ రంగంలో సంఖ్య పెరిగిన కొద్దీ సారం తరుగుతుందేమో అనిపిస్తుంది. అయినా, ఈ లోపం చెప్పుకో తగినంత లోపం కాదు. కారణం, ఈ కళలోని ఔన్నత్యాన్ని కాపాడటంలో నిమగ్నులై ఉన్నారు.

స్త్రీ ప్రధానమైన లాస్యం విస్తరించి నంతగా పురుష ప్రధానమైన తాండవం తగినంతగా వికసించటం లేదేమో అనిపిస్తుంది. శాస్త్రీయ నృత్యంలో అభిరుచి పెరుగుతున్నట్లే జానపద నృత్యంలో కూడ పెరుగుతూంది.

ఒకప్పుడు మనప్రాంతంలో బాలికలకు ఎక్కువగా సంగీతం నేర్పబడుతుండేవి. నేడు దాని స్థానాన్ని నృత్యం ఆక్రమించినట్లు కనిపిస్తుంది.

ఇక సృజనాత్మక కళలైన చిత్ర, శిల్పకళా రంగాన్ని గురించి విచారిస్తే, ఇపుడు వ్యాప్తిలో ఉన్న ప్రదర్శనాత్మక కళలంత వ్యాప్తి చెందకపోయినా, ఒక విధమైన ఉన్నత పదంలోనే అవి పయనిస్తున్నాయి అనక తప్పదు.

మన ప్రాంతపు కొందరు ఆధునిక చిత్రకారులు విదేశాల్లో కూడ తమ సృజనాత్మక నైపుణిని దక్షతతో వ్యక్తపరుస్తున్నారు, అంతర్జాతీయ కీర్తిని ఆర్జించుకొంటున్నారు. విదేశాల్లో కీర్తినార్జించుకోటం మాత్రమే ఒకరి ఘనతకు ప్రధాన లక్షణం కాకపోయినా అదికూడ ప్రధాన లక్షణాల్లో ఒకటి.

నేడు ప్రపంచాన్నంతా ఆక్రమించి ఉన్న ఆధునిక చిత్ర, శిల్ప కళలు మనదేశంలో కూడ వ్యాప్తి చెంది ఉన్నాయి. చిత్ర, శిల్పకళల రంగాల్లో ఈ ఆధునిక రీతి అనబడేది ఎంతవరకు సమర్థనీయమో తెలియదు కాని చాలా వాటికి ఉన్నట్లే దీనికి కూడా రెండు దశలున్నాయి, వాంఛనీయదశ అవాంఛనీయదశ అని. ఈచర్చ వేరే విషయదశ. వీటన్నిటి ననుసరించి కొన్ని విషయాల్లో నడవక తప్పదు, మరికొన్నిటిలో కాల రీతిని అతిక్రమించక తప్పదు.

## ఆడపిల్ల

అందమున్న ఆడపిల్లా
చదువుకున్న ఆడపిల్లా
ఉద్యోగమున్న ఆడపిల్లా
గర్వపడకండెవ్వరూ -
ఈ కాలంలో కట్నం ఇచ్చుకోవాల్సిందే
అందరూ !

( శ్రీశ్రీ గారికి క్షమాపణలతో )

— ఐ. ఎల్. ఎన్. చంద్రశేఖర్

ఏది ఏమయినా, మనప్రాంతంలో సంగీత, నాటక, నర్తన కళలంతగా చిత్ర శిల్పకళలు వికసించకపోయినా, మిగతా ఏ ఇతర ప్రాంతాలకంటే తక్కువగా మాత్రం లేదు.

వాస్తవ చిత్రణ, నైరూప్యచిత్రణ కూడ సమానంగా వృద్ధిపొందుతూనే ఉన్నాయి. నవభారత కళ అనే విధానంలో, వంగదేశంలో, ఈ శతాబ్దపు మొదటి భాగంలో ప్రారంభించ బడినతరువాత వికాశం చెందిన ప్రాచ్యచిత్ర కళా శైలి, బొంబాయి కళా విద్యాలయాల్లో ఆ రోజుల్లో నేర్పబడే పాశ్చాత్య చిత్రకళా శైలి కూడ మన ప్రాంతంలోని చిత్రకారులచేత సమానంగా అనుసరించబడి రాణించాయి.

అదేవిధంగా నేడు అమల్లోఉన్న ఆధునిక చిత్రకళకూడ.

ఆధునిక చిత్రకళలోని ఒక శోచనీయ విషయం ఏమంటే, అది చాలామంది చిత్రకారుల కుంచెల క్రింద మౌలిక సృజనగా కంటే అనుకరణగా ఎక్కువ రూపొందింది. దృశ్యజగత్తును అనుకరించటం ఉత్తమ చిత్రకళ కాదంటూనే ఇతర్ల చిత్రాలను అనుకరించటం గర్హనీయ విషయం.

ఒకరి ప్రభావం మరొకరిపై పడవచ్చు కాని ఒకరి చిత్రాన్ని మరొకరు అనుకరించటం వాంఛనీయం కాదు.

వెనుకటి కంటే ఇప్పుడిక్కడ కూడ పాట కచేరీలు, నృత్య ప్రదర్శనాలంత విరివిగా కాకపోయినా, చిత్రప్రదర్శనాలు ఎక్కువగానే జరుగుతున్నాయి. వీటిని దర్శించే ప్రేక్షకుల సంఖ్యకూడా పెరుగుతూనే ఉంది.

చిత్రకారుల కంటే చిత్రాన్ని చూచి ఆనందించేవారి సంఖ్య పెరగటం అవసరం. అప్పుడు కాని చిత్రకారుల సంఖ్య కూడా పెరగదు. చిత్ర రసాస్వాదన పెరిగితేనే చిత్ర రచన కూడా పెరిగేది. ఇదే శిల్ప కళా రంగానికి కూడా చెందుతుంది.

నేటి చిత్ర, శిల్పకళలు దేశ భేదాలను, జాతి ప్రభేదాలను దాటి ఒక విశ్వజనీన స్వేచ్ఛావాతావరణను అందుకొన్నట్లే నేటి వాస్తు కళ కూడా ఒక విశ్వజనీన విధానాన్ని పొంది ఉన్నది.

సాంప్రదాయిక భవన నిర్మాణ సూత్రాల నధిగమించి ఉపయోగ రీతికి ఎక్కువ ప్రాధాన్యాన్నిచ్చింది. ఆధునిక వాస్తు కళ సౌందర్య తత్వానికంటే ప్రయోజన వాస్తవాన్ని ఎక్కువగా అనుసరిస్తుంది. ఇందులోని సౌందర్య తత్వం ఇంటిలోని నివాస సౌకర్యానికి అడ్డం రానంతవరకే అవలంబించబడుతుంది. సౌందర్యమూ ఉపయోగమూ వాస్తు నిర్మాణంలో సహజీవనం చేయటం వాంఛనీయం. కాని, సౌందర్యం ఉపయోగానికి అడ్డు తగిలితే మాత్రం సౌందర్యాన్ని తగ్గించి ఉపయోగాన్ని హెచ్చించటం అవసరం. ఇదే ఆధునిక గృహ నిర్మాణ కళ ఆదర్శం.

మన కళారంగం పరిపూర్ణంగా ఉన్నదని అనటం దుస్సాహసమే అవుతుంది. కారణం, మానవ జీవితమే పరిపూర్ణమైంది కాదు. విశ్వ సృష్టియే పరిపూర్ణం కాదు. అటువంటప్పుడు మానవ జీవితంలో ఒక భాగమైన కళారంగం మాత్రం పరిపూర్ణంగా ఉండటం ఎట్లా జరుగుతుంది ? కనుక మన కళారంగాన్ని గురించి నైరాశ్య వాదాన్ని పెంచుకునే అవసరం లేదు.

మన కళారంగం అపుడపుడు కళ తప్పినట్లు భ్రమ కలిగినా, అది కళ తప్పలేదు ; కళ తప్పితే అది కళా రంగమే కాదు ; అవుతుంది కళ లేని రంగం !



# పరిష్కారం ( మినీకథ )

చిర్ల రాజేంద్రప్రసాదరెడ్డి

"వెళ్ళిన పని ఏమైందండి ?" ఆతృతగా అడిగింది కాంతం.

"ఆఁ మామూలే ! పది వేలకు తగ్గనంటున్నారు" అన్నాడు చలపతి.

"అప్పుచేసైనా ఈ సంబంధం ఖాయం చెయ్యాలి. కనీసం ఖర్చులతోసహా పదిహేను వేలదాకా అవుతుంది" అందామె.

"ఈ రిటైర్డ్ అయిన గుమాస్తాకు ఎవరప్పిస్తారె ?" దీర్ఘంగా నిట్టూరుస్తూ అన్నాడు చలపతి.

నల్గొండ హెడ్ పోస్టాఫీసులో గుమాస్తా గిరిచేసి రిటైరయిన చలపతికి సంపాదన తక్కువే అయినా సంసారం పెద్దదే. నలుగురు కొడుకులను కష్టపడి చదివిస్తే రెక్కలందగానే ఎవరి దారిన వారు వెళ్ళిపోయారు. ఉన్న ఒక్క కూతురి పెళ్ళి ఎలా చెయ్యాలా అన్నదే చలపతికి సమస్యగా మిగిలిపోయింది. కూతురికి ఇరవై అయిదు సంవత్సరాలు వచ్చినా పెళ్ళి చెయ్యలేక పోతున్నామనే బాధ ఒకటి మనసులో తొలుస్తూనే వుంది.

* * *

"కొత్త సంబంధం ఖాయం చెయ్యండి" అంది కాంతం.

"అలాగే ? ? అన్నాడు చలపతి డబ్బు ఎలా సంపాదించాలో తెలీక.

ఎవరో ఒకరు అప్పు ఇస్తారన్న ధీమాతో ముహూర్తం పెట్టించాడు. ముహూర్తం దగ్గరకొస్తున్న కొద్దీ ఖంగారు ఎక్కువై పోసాగింది.

తన తోటి ఉద్యోగి కామేశం దగ్గరకి వెళ్ళాడు.

"రావోయ్ చలపతి ! కూతురి పెళ్ళి చేస్తున్నావుట".

"ఆఁ. ఇప్పుడెలా వుంటున్నావు" అన్నాడు చలపతి.

"ఆఁ ఏముంది పెన్షన్‌లతో చేసిన అప్పులు సగం తీరాయి" మామూలు మధ్యతరగతివాడి ఆక్రోశం.

అతన్ని అప్పడగటం భావ్యం కాదనుకున్నాడు చలపతి.

నెమ్మదిగా సెలవు తీసుకుని ఇంటిదోవపట్టాడు చలపతి.

"ఏమండి పెళ్ళికింకా మూడ్రోజుల టైమ్ మాత్రమే వుంది. అమ్మాయిని పెళ్ళికూతుర్ని చెయ్యాలి." అంటూ ఆ రోజుకి కావాల్సిన లిస్ట్ తీసుకొచ్చి చేతిలో పెట్టింది.

"అన్నట్టు ఎక్కడన్నా డబ్బు పుట్టిందా ?" అంది ఆతృతగా.

"లేదు చూస్తున్నా" అంటో సంచీ తీసుకుని బజారు బయల్దేరాడు.

ఆలోచనలోవున్న చలపతి రోడ్డుమీద వెళ్తున్నాడు. రాంగ్‌సైడ్‌లో వస్తున్న లారీని చూడలేదు. గబుక్కున తలఎత్తి చూసేసరికి ఎదురుగా పెనుభూతంలా లారీ.

"అమ్మా ?" అన్న ఆర్తనాదం చలపతి నోటివెంట ఆఖరిసారిగా వచ్చింది.

బజారుకెళ్తున్న కామేశం గుమికూడివున్న జనాల్ని చూసి లోపలకి తోసుకెళ్ళి చూస్తే "చలపతి". నోటంట మాట రాలేదు.

లారీ వాళ్ళతో మాట్లాడి చలపతి కుటుంబానికి పదిహేను వేల రూపాయలు ఇచ్చే ఏర్పాటు చేసాడు కామేశం.

చలపతికి దహన సంస్కారాలు దగ్గరుండి జరిపించాడు కామేశం.

ఆ పదిహేను వేలతో చలపతి కూతురి పెళ్ళి జరిపించి మిత్రుడిగా తన బాధ్యత నెరవేర్చుకున్నాడు కామేశం.

"ఒక తండ్రి ప్రాణం విలువ ఒక కూతురి పెళ్ళి" అన్న ఆలోచన రాగానే బాధపడ్డాడు కామేశం.

చలపతిలాంటి మధ్య తరగతి మానవుడి కూతురి పెళ్ళికి ఇదా పరిష్కారం !



## పుస్తక సమీక్ష

# శ్రీ అడివి బాపిరాజు నవలా సాహిత్యానుశీలనము

రచయిత : డా॥ మన్నవ సత్యనారాయణ

వెల : ముప్పది రూపాయలు

ప్రతులకు: డా॥ మన్నవ సత్యనారాయణ
లేబర్ కోర్టు దగ్గర
గుంటూరు - 522 006

ఇది ఒక పరిశోధనా వ్యాసం. తెలుగు సాహితీ ప్రియులు గర్వించే కవి, నవలాకారుడు, చిత్రకారుడు అడివి బాపిరాజు నవలలపై మన్నవ సత్యనారాయణగారు సమర్పించిన సిద్ధాంత వ్యాసం ! నాగార్జున విశ్వవిద్యాలయం నుండి పిహెచ్. డి. డిగ్రీని పొందిన పత్రం ! పుంఖానుపుంఖంగా పరిశోధనా గ్రంథాలు వెలువడుతున్న ఈ రోజుల్లో ఇది రాళ్ళల్లోరవ్వ ! రచయిత డా॥ మన్నవ సత్యనారాయణ బాహ్యదృష్టి కొరవడిన వ్యక్తి, అయితే తీక్షణమైన అంతర్నేత్రాలు కలవాడు బాపిరాజు జీవితంలోని వివిధ ఘట్టాలను, బాపిరాజు ఆలోచనలను, ఆశలను, ఆదర్శాలను, సిద్ధాంతాలను, అన్నింటినీ వివిధ వ్యక్తులద్వారా, ముఖాముఖిగానూ, ఉత్తర ప్రత్యుత్తరముల ద్వారాను తెలుసుకొని తన సిద్ధాంత వ్యాసంలో పొందుపరచగల్గాడంటే, అది ఆయనలోని సాహితీ పిపాసను, అకుంఠిత కార్యదీక్షనూ స్పష్టం చేస్తుంది. అందుని చేసి విధి ఆతనిపట్ల తొలుత చిన్నచూపు చూసినా, సరస్వతీ సమారాధకునిగా చేసి, విశ్వవిద్యాలయంలో ప్రాధ్యాపక స్థానాన నిలిపి తను చేసిన తప్పును సవరించుకున్నది.

ఇది ఒక సిద్ధాంత వ్యాసం గనుక, దీనికంటూ ఒక పద్ధతి ఉన్నది. మిగిలిన సమీక్షలకు, ఈ వ్యాసానికి చాలా భేదం ఉంటుంది. ఉండితీరాలి కూడా ! జల్లెడతో జల్లించిన విధంగా ఒకే విషయాన్ని ఎన్నో కోణాలలో పరిశీలించి గుణదోష వివేచన చేయటం, ఇలాంటి సిద్ధాంత వ్యాసాలకు ప్రధాన లక్షణమవుతుంది. డా॥ మన్నవ సత్యనారాయణ ఈ సిద్ధాంత గ్రంథాన్ని అయిదు ప్రధాన అధ్యాయాలుగా విభజించారు. తొలి అధ్యాయంలో బాపిరాజుగారి వ్యక్తిగత జీవితాన్ని, ఆయన బహుముఖ ప్రజ్ఞను రచయిత విశదంగా వివరించారు. ఒక ప్రిన్సిపాల్‌గా, కళాదర్శకునిగా, పత్రికా సంపాదకునిగా, చిత్రకారునిగా, నవలా రచయితగా, కథకారునిగా, గేయకర్తగా, నాటక రచయితగా, వ్యాసకర్తగా జాతీయవాదిగా, వ్యక్తిగా బాపిరాజు ఎలా ఆదర్శమూర్తి అయినారో, డా॥ సత్యనారాయణ నిరూపించిచూపాడు. రెండవ అధ్యాయంలో నవలకు నిర్వచనమిస్తూ, తెలుగు నవలావిర్భావాన్ని గురించి చర్చించాడు తెలుగులో తొలి నవల ఏదన్న విషయాన్ని ప్రసావిస్తూ, నరహరి గోపాల కృష్ణమ్మ చెట్టిగారి శ్రీ రంగరాజచరిత్రం, శ్రీ కొక్కొండ వెంకట రత్నంగారి మహాశ్వేత, శ్రీ కందుకూరి వీరేశలింగం గారి రాజశేఖర చరిత్ర- ఈ మూడింటిలో రాజశేఖర చరిత్రయే మొదటి నవలగా నిర్ణయించాడు. ప్రధానాంశానికి దూరమై పోతాయన్న శంక వలన గామోసు సహేతుకమైన వివరణను మాత్రం రచయిత దీనికి ఇవ్వలేదు

ఆపైన మూడవ అధ్యాయంలో అడివి బాపిరాజు సాంఘిక నవలలను గురించి, నాల్గవ అధ్యాయంలో చారిత్రిక నవలలను గురించి విశదంగా చర్చ జరిగింది. సాంఘిక నవలలైన నారాయణరావు, తుపాను, కోనంగి, జాజిమల్లి, నరుడు లోని సామాజిక చైతన్యాన్ని, రాజకీయ వాతావరణాన్ని రచయిత విపులంగా చూపాడు.

1930 వ సంవత్సరంలో చెలరేగిన స్వేచ్ఛాప్రణయ సిద్ధాంతాన్ని బాపిరాజు గారు తన నవలలో ఎలా ప్రతిఘటించారో చూపాడు. వర్ణవర్గ వ్యవస్థకు బాపిరాజు ఎలాంటి విముఖతను చూపారో, ఆయన రచనలను మాధ్యమంగా చేసుకొని రచయిత చూపాడు. అదే విధంగా ఒక జాతీయవాదిగా, ఖద్దరుపడకడాన్ని, ప్రచారం చేయడాన్ని, ఆయన నవలలో ఎలా చూపారో, గాంధీ ఉప్పు సత్యాగ్రహాన్ని

గురించి, ద్వితీయ ప్రపంచ మహా సంగ్రామాన్ని గురించి, ఎలా తన రచనల్లో మలుచుకుంటూ వివరించారో కూడా రచయిత సోదాహరణంగా చూపాడు.

హిమబిందు, అడవిశాంతిశ్రీ, అంశుమతి, గోనగన్నా రెడ్డి బాపిరాజుగారి చారిత్రిక నవలలు. ఈ నవలల్లోని కథాంశాలను, పాత్రలను గురించి చర్చిస్తూ, కథా స్వభావాన్ని బట్టి వానిలో వచ్చిన మార్పులను రచయిత చూపాడు. అయిదవ అధ్యాయంలో ఆంధ్ర నవలా వాఙ్మయంలో బాపిరాజు స్థానాన్ని సోదాహరణంగా సహేతుకంగా చూపటం జరిగింది.

ఇక లోప పరామర్శ అనే ఉప శీర్షిక క్రింద, అవసరమైన చోట్ల, బాపిరాజు ఎక్కడెక్కడ ఏకాగ్రతను కోల్పోయి, ఏ యే దోషాలను చేశారో చూపటం జరిగింది. ఇది నిస్సందేహంగా ప్రశంసనీయమైన గ్రంథం! కాని సామాన్య పాఠకుని దృష్టిలో పెట్టుకొని, దీన్ని పుస్తక రూపంలో తెచ్చే టప్పుడు రచయిత కొన్ని మార్పులుచేసి ఉంటే బాగుండేది! కొన్ని చోట్ల చర్చా భాగం సామాన్య పాఠకునికి విసుగు కల్గిస్తుంది. ఉదాహరణకు తెలుగు నవలా విహంగ వీక్షణం– "బర్డ్స్‌వ్యూ" లా అన్పించదు. ఇలాంటి విషయాలలో ఇంకా కొద్దిగా శ్రద్ధ చూపి ఉంటే, ఇది కేవలం విమర్శనా దృష్టి గలవారికి మాత్రమేకాక, అందరికీ ఉపయోగపడి ఉండేది! కాని నిస్సందేహంగా ఇది చక్కని పుస్తకం! అందరూ చదవ దగ్గది!

— డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు

★ ★ ★

# రామాయణ పాత్రలు

ధర్మమార్గం చరిత్రేణ, జ్ఞానమార్గంతునామతః
తథా ధ్యానేన వైరాగ్యం, ఐశ్వర్యం
స్వస్యపూజనాత్ ॥

అను వ్యాస మహర్షి సూక్తి ననుసరించి ధర్మమార్గానుగామియగు శ్రీరామచంద్రుని పవిత్ర చరిత్ర అన్నివర్గాల వారికి ఆదర్శమై నాటినుండి నేటివరకు సర్వ ప్రపంచ ప్రజలకు అనుసరణీయమైనది. ఇట్టి రామాయణ గ్రంథము నందలి కొన్ని ప్రధాన పాత్రలను పరిశీలించి వారి స్వరూప స్వభావాలతోపాటు ఆదర్శమగు వారి ఆచరణ విధానమును కూడ శ్రీయుతులు కొమరగిరి కృష్ణమోహనరావుగారు నేటి యువతకు మనన యోగ్యమగునట్లు సులభ శైలిలో "రామాయణ పాత్రలు" పేర ఆంధ్రుల కందించినారు. ఆ యా పాత్రల పరిశీలనాంశములందు ప్రధానమైనవి పేర్కొనుచూ, నేటి మానవజాతికి నిత్యజీవితములో అవసరమై, ఆచరణీయములగు సన్నివేశములను చక్కగా వివరించినారు. ఈ రచయిత శ్రీరామ భరతుల మైత్రి, శ్రీరామ లక్ష్మణుల మైత్రి చక్కగ వివరించి అన్నదమ్ముల ఆదరాభిమానములు నేటి కాలాని కాదర్శప్రాయములని నిరూపించిరి. సాధు హృదయులగు శ్రీ కృష్ణమోహనరావుగారు ధర్మ రత్నములకు, నీతి రత్నములకు ఆకరమైన రామాయణ మహా సాగరమున మునకలువేసి అనర్ఘ రత్నములను వెలికితీసి వాటి దివ్య కాంతులను విస్తరింప జేసిరి. ప్రసిద్ధ ఘట్టములందలి "రామం దశరథం విద్ధి...." "నాహం జానామి కేయూరే...." వంటి ప్రభాస శ్లోకములను ఉదహరిస్తూ బాలల హృదయాలకు హత్తుకొనునట్లు ధార్మిక, నైతిక సారాంశములను బోధించిరి. వీరి పాత్ర పరిశీలనా పద్ధతి రామాయణమును సమగ్రముగ పఠింపలేని వారికి చాలా ప్రయోజనకరమేగాక రామాయణమంతటిని చదువవలయునను ఆసక్తి కలిగించును. అమర భాషలోని రామాయణ పాత్రల పవిత్ర చరిత్ర ఆంధ్రుల హృదయమున స్థిర ముద్ర అగునట్లు యీ రచయిత చేసిన కృషి ప్రశంసనీయము. ఇట్టి గ్రంథమును పాఠ్య గ్రంథముగ ప్రభుత్వము నిర్ణయించి ధర్మ దీప్తిని, నైతిక బలమును బాల బాలికలకు కలిగించుట మిక్కిలి యవసరము. అశాంతి తాండవిస్తున్న ఆధునిక కాలమున ప్రశాంతతను కలిగించే పవిత్ర పాత్రల ప్రవర్తన, సంభాషణ అందరికీ సంస్మరణీయమే. ఎవడు శ్రీరాముని చూడడో, ఎవనిని శ్రీరాముడు చూడడో వాని జన్మ వ్యర్థమను మాట ఈ గ్రంథము చదివినవారికి స్పష్టము కాగలదు. ఇట్టి భారతీయ సంప్రదాయ ప్రతిబింబితములగు మరికొన్ని గ్రంథములను రచించి యీ రచయిత తాను తరించుచూ లోకమును కూడ తరింపజేయాలని మావంటివారి అభిలాష.

రామాయణ పాత్రలు–వెల : రు. 6–00

ప్రతులకు : జయప్రద పబ్లికేషన్స్

24–51 రామానాయుడుపేట, మచిలీపట్నం

— మల్లాప్రగడ శ్రీరంగారావు

# జ్యోతిషవాణి

నిర్వహణ : దైవజ్ఞరత్న వాస్తుజ్యోతిష విద్వాన్
**కవితా కామేశ్వర శర్మ**
అవనిగడ్డ - 521 121

**డి. సత్యనారాయణ** నందిగామ

ప్రశ్న : సంతానము ఏ సంవత్సరములో కల్గును.

సమా : జాతకం చాలా వివరంగా పంపినందులకు అభినందనలు. చాలా శ్రమచేసి పంపినారే ! సంతానం వర్తమానంలో జరుగుచున్న రాహు భుక్తి (శు+రా) లేదా గురు భుక్తి (అటుపిమ్మట) లో కల్గును.

ప్రశ్న : ప్రమోషను సుమారుగా ఏ సంవత్సరములో వచ్చును.

సమా : 1987 పూర్తి లోపల రాదగును.

**ఎస్. వి. కె. కిశోర్‌బాబు** నూజివీడు

సమా : తమరు రెండు కూపనుల బంపినా రెందుకు స్వామీ ! ఒకటి చాలునుగదా ! పోతే : కోర్టులోని దావా మొత్తంమీద మీకు అనుకూలమే. వ్యాపారం వద్దు బాబుగారూ ! జనరల్‌గా ప్రశ్న కాలరీత్యా జాతక గోచారములు రెండూ బాగుండలేదు. జాయింటు మీకు కలిసి రాదు. కష్టమో సుఖమో ఎప్పుడైనా మీ కాళ్ళమీద మీరు నిలబడవలసినదే - యింకా 2 సం॥ వరకు మీకు యీతి బాధలుంటవి. అయినా ఏదో Job లో చేరుతారు.

**బొద్దేటి పూర్ణేశ్వరరావు** వి. మాడుగుల

సమా : పరీక్ష పాసవుతారు. ఉద్యోగం వల్ల జీవనం. ఎలెక్ట్రికల్ డిపార్ట్‌మెంటులో Job కాదగును. మీరు జాతకం పంపినారు. మహాదశా శేషం పంపలేదు. నాకు పని కల్పించారు. మహాదశాశేషం మాకు ఆయుధం వంటిది ఫలాలు చెప్పుటకు. మీరే కాదు కొంతమంది యీలాగే చేస్తున్నారు. ఏం చేస్తాం ! పూర్ణేశ్వరా !

**సిహెచ్. మేఘశ్యామరావు** బందరు

సమా : మీ Job లో మార్పు ఉంటుంది. బ్యాంకు పరీక్షలు వ్రాస్తూ ఉండండి. సెలక్టు అవుతారు. వివాహం 1987 అనుకూలం. గణపతిని, శ్రీరాముని సేవించండి. మీకు దగ్గరలో ఉండే ఉంటారు బహుశా.

**ఎస్. శ్రీదేవి** అనంతపురం

( నా కర్మ యింతేనా ? )

సమా : ఎవరి కర్మకు వారే బాధ్యులు. " ఎడపక పూర్వజన్మమున యే మిథునంబును బాయచేసి వారడలగ నవ్వితినో, ఆ అఘ మూరక పోవునే లక్ష్మణా " అని సీత చేత అనిపిస్తాడు కంకంటి పాపరాజు. ఈ పద్యానికి అర్థం తెలుస్తూనే ఉందిగా కష్ట సుఖాలు ప్రారబ్ధాధీనములు. " అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం " గౌరీ దేవిని ఆరాధించండి. తులసి ప్రదక్షిణములు చేయండి.

**శివకోటి సూర్యప్రకాశరావు** కొణకంచి

సమా : ఇంకా పైచదువు చదువుతారు. ఉద్యోగం ఇతర రాష్ట్రంలో చేస్తారు. భవిష్యత్తు బాగుంటుంది. చూడండి - పేరు మార్పిడి జరిగినా - జాతక ఫలాలు మారవు. ఉత్తర నక్షత్రం మంచిదే జనరల్‌గా. నారాయణీ స్తోత్రం - లేదా దుర్గా సప్త శ్లోకి పారాయణ చేస్తూ ఉండండి - సర్వ విధాలా మంచిది.

**జ్యోతిషవాణి**

పేరు ........................................

పూర్తి చిరునామా ........................................

........................................

లేఖ వ్రాయు తేది ....................

టైము: పగలు/రాత్రి ....................

జనన తేది ............ లేనిచో సుమారు వయస్సు

# శ్రీ జగదీష్ చంద్రబోస్

ఈ ఆధునిక ప్రపంచంలో లోకవ్యాప్తంగా కీర్తి గడించిన శ్రీ జగదీష్ చంద్రబోస్ మహా దేశభక్తుడు, గొప్ప శాస్త్రవేత్త.

జగదీశ చంద్రబోస్ నవంబరు 30, 1858 బెంగాలు రాష్ట్రములోని విక్రమపూరులో జన్మించెను. తండ్రి శ్రీ భగవాన్ చంద్రబోసు. పరీదుపూరు జిల్లా కలెక్టరు. అతి బాల్యము నుండి జగదీష్ చంద్రబోసు స్వభావసిద్ధమైన దృశ్యములను పర్యవేక్షించుట, పరీక్ష చేయుటయందు ఎక్కువ అభిలాష చూపుచుండెడివాడు. తండ్రి కూడా తన కొడుకును అట్టి వాతావరణములోనే అతని అభిరుచుల కనుకూలముగానే పెంచి ఉన్నత స్థాయి చదువులకుగాను ఇంగ్లాండు పంపెను.

1888 లో జగదీష్ చంద్రబోసు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయము నుండి రసాయన శాస్త్రములోను; వృక్షశాస్త్రములోనూ పట్టభద్రుడై ఇండియాకు తిరిగి వచ్చెను. కలకత్తాలోని ప్రెసిడెన్సీ కాలేజీలో అధ్యాపకుడిగా పని చేసెను.

జాతీయ భావములతో కూడిన మన స్తత్వముగలవాడు కాబట్టి, జగదీష్ చంద్రబోసు ప్రెసిడెన్సీ కాలేజీలో జీతభత్యములు లేకుండగనే మూడు సంవత్సరములు గణనీయముగా పనిచేసెను. యూరోపియన్ అధ్యాపకుల కిచ్చు వేతనముల కంటే తక్కువ తీసికొనననే దీక్షతో వుండి మహా విలువగల సేవలను చేసిన మహానుభావుడు. కలకత్తా విశ్వవిద్యాలయము కూడా ఆయన కార్య దీక్షకు మెచ్చుకొని యూరోపియన్ అధ్యాపకుల వేతనముల ప్రకారామే మూడు సంవత్సరముల వేతనములు జగదీష్ చంద్రబోసుకి చెల్లించెను. ఆ ద్రవ్యమును కలకత్తాలో ఒక పెద్ద లేబరేటరీ నిర్మాణమునకై వినియోగించి ప్రఖ్యాతి గాంచెను.

వైర్‌లెస్ టెలిగ్రాఫ్ యొక్క అద్భుతములను విశదీకరించి ప్రపంచమునకు చాటి చెప్పిన ప్రప్రథముడు - అని ప్రతీతి. ఆంగ్లేయుడు కానందున జగదీష్‌చంద్రునకంత ఘనతను బ్రిటీషువారు గుర్తించకుండిరి.

## క్రోవి వెంకటరత్నం

ఏది ఎట్లున్నను జగదీష్ చంద్రబోసు ఎలక్ట్రోమెగ్నెటిక్ రంగమునందు, వృక్షశాస్త్రమునందు ఎక్కువ పరిశోధనలు చేసి కీర్తి గడించిన మహాపురుషుడు. జంతుజాలము లేవిధముగా స్పందనశక్తి కలిగియున్నవో అదే విధముగా చెట్లు చేమలకుగూడ స్పందనశక్తి (ఫీలింగు) ఉన్నదని నిర్ధారణచేసెను. మరియు ఉక్కు, రాళ్ళు కూడా జంతువుల వలెనె టెన్షన్‌కు గురి అవుతాయని నిర్ధారణ చేసెను. అనేక పనిముట్లను చెట్లేవిధముగా సంకలనమవునో కనుటకు కనిపెట్టి నిర్మాణము చేసెను. యూరప్ దేశములోని అనేక విశ్వవిద్యాలయములలో ఉపన్యసించి అనేక సాంకేతిక భావాలను ప్రపంచమంతట వెదజల్లెను. ఎంతమాత్రము సంకుచితభావము లేని శ్రీ జగదీష్ చంద్రబోసు యొక్క తెలివితేటలకు ప్రపంచమంతయు మెచ్చుకొనెను. 1917 లో ఈయనకు నైట్‌హుడ్ బిరుదము నిచ్చిరి. అదే సంవత్సరములో రూ. 5 లక్షలు ఖర్చుపెట్టి బోస్ విజ్ఞాన్‌భవన్‌ను నిర్మాణము చేసెను. 1938 లో శ్రీ జగదీష్ చంద్రబోస్ ఈ సంస్థకు రూ. 15 లక్షలు ఇచ్చి దివంగతుడాయెను. సార్థక జీవి కారణజన్ముడు గదా !



# భాషా సమైక్యతకు కృషిచేస్తున్న యు. పి. న్యాయవాది శ్రీ సూర్యనాథ ఉపాధ్యాయ



నేను ఈ మధ్య పవిత్ర త్రివేణి సంగమమును సందర్శించాను. ఆ సందర్భమున అల్హాబాద్‌లో నివసిస్తున్న తెలుగు వారిని కలుసుకునే సద్భాగ్యం నాకు కలిగింది. ఎవరినోట విన్నా శ్రీ సూర్యనాథ ఉపాధ్యాయ పేరే. అప్పుడు ఆయనను కలుసుకొని తీరాలనే కుతూహలం నాకు కల్గింది. కొంతమంది తెలుగు మిత్రులతో కలసి వారింటికి వెళ్ళాను. ఆయన ఒక ప్రముఖ హైకోర్టు న్యాయవాది. ఇల్లు పార్టీలతో కిలకిలలాడుతున్నది. నిరాడంబరత ఆయన ముఖంలో ఉట్టిపడుతూ వున్నది. మిత్రులు నన్ను ఆయనకు పరిచయం చేశారు. ఎంతో ఆనందంతో నన్ను తెలుగులో పలుకరించారు. ఒక యు. పి. న్యాయవాది తడుముకోకుండా తెలుగులో మాట్లాడటం నన్ను ఆశ్చర్యచకితుణ్ణి గావించింది. తెలుగు భాషమీద ఆయనకుగల మమకారం, గౌరవం వర్ణించడానికి నా మాటలు చాలవు. అది 12 సం. క్రిందటి ఉదంతం. దక్షిణాది రాష్ట్రీయులకు వెళ్ళి హిందీని ప్రచారం చేయాలని ప్రముఖులు ఆలోచిస్తున్న తరుణం. ఆటువంటి పెద్దలు మన ఉపాధ్యాయను కలువగా " మనకు హిందీ ఎంత అభిమానమో, ఎవరి భాష వారికి అంత ముఖ్యం. ఇతర భాషల వారిని హిందీని నేర్చుకోవాలని కోరుతున్నప్పుడు మనం దక్షిణాది భాషలలో ఏదో ఒక భాషను నేర్చుకుంటే బాగుంటుంది గదా ! అప్పుడు భావ సమైక్యతతోపాటు భాషా సమైక్యత కూడా ఏర్పడుతుంది. జాతీయ సమైక్యతకు దోహదం చేసినవారమవుతాం. " అని స్పష్టం చేశారు. అభిప్రాయాలను వెలిబుచ్చడంతో సంతృప్తి చెందక తెలుగు భాషను నేర్చుకుని తీరాలని వారు సంకల్పించుకున్నారు. క్షణం తీరుబడిలేని ఆ న్యాయవాది అకుంఠిత దీక్షతో తెలుగు అధ్యయనం చేయడం ప్రారంభించారు. తెలుగు డిప్లమా పరీక్షలకు వెళ్ళి ఉత్తీర్ణులయ్యారు. పరీక్షలతోనే సంతృప్తి చెందక తెలుగు భాషా విజ్ఞానాన్ని తనివితీరా ఆస్వాదించారు. అనేక తెలుగు నవలలు, సాహిత్య ప్రబంధాలు, పురాణాలు చదివారు, అర్థం చేసుకున్నారు. శ్రీ చిపురుల పురుషోత్తంగారు రచించిన " ఏది పాపం " నవలను హిందీలోనికి చక్కగా అనువదించారు. దానికి కేంద్ర మంత్రివర్యులు శ్రీ పి. వి. నరశింహారావుగారు చక్కటి పీఠికను వ్రాసి పంపడం విశేషం. హిందీలోనున్న పీఠికను వారు చదివి వినిపించారు. ఉపాధ్యాయగారి తర్జుమా ఎంత సుందరంగా వున్నదో శ్రీ పి. వి. గారి పీఠిక వలన నాకు బోధపడింది. మన ఉపాధ్యాయ 1985 సం. లో వారణాశి విశ్వవిద్యాలయంలో జరిగిన తెలుగు రజతోత్సవ సభలలో తెలుగులో ప్రసంగించి వారందరిని ఆశ్చర్యచకితులను గావించారు. ఆ నాటి బీహార్ గవర్నర్ తెలుగువాడైన శ్రీ పెండేకంటి వెంకట సుబ్బయ్యగారు మాత్రం ఆ తెలుగువారి సభలో ఇంగ్లీషులో మాట్లాడారు.

శ్రీ ఉపాధ్యాయ జీవితం R. M. S. లో సార్టర్‌గా ప్రారంభమైంది. అంతకు పూర్వం మెట్రిక్యులేషన్‌లో

కూడా ఉత్తీర్ణుడవ్వని వ్యక్తి M. A., LL. B. స్వయం కృషితో ( 1943-1951 ) ఉత్తీర్ణుడై నేడు అల్లాబాద్ హైకోర్టులో ఒక ప్రముఖన్యాయవాదిగా చెలామణి కావడం ఆయన అకుంఠిత దీక్షకు నిదర్శనం. మరల ఇప్పుడు తెలుగు భాషాజ్ఞానాన్ని సంపాదించి ఒక తెలుగు నవలను హిందీలోకి తర్జుమా చేసిన ఘనతను ఆయన సంపాదించారు. అంతేకాదు- తెలుగు, భోజపురీ భాషలలో గల పోలికలను వివరిస్తూ ఒక చక్కటి కరపత్రమును తెలుగులో కూడా ప్రచురించారు. అల్లాబాద్ జిల్లా ఆంధ్ర అసోషియేషన్ కేంద్రస్థానం వారిగృహమే. వారు దానికి ప్రధాన సలహాదారు మరియు పోషకులు కూడాను. వారి గృహంలో తెలుగు పుస్తక గ్రంథాలయమునకు ప్రత్యేకంగా ఒకగదిని కేటాయించారు. భాషల విషయంలో వారి అభిప్రాయములను పరిశీలించితే ఆయన ఎంతటి సర్వభాషాభిమానో బోధపడుతుంది. ఆయన ప్రచురించిన కరపత్రంలో "మన దేశమునకు ఏదైన భాషా సమస్య ఉంటే, దాని కోసం ముఖ్యమైన బాధ్యత మాది అంటే ఉత్తర భారతంతో నివసించే వారిదే. మన సంవిధాన ప్రకారంగా హిందీ మన రాష్ట్రభాష. అందువలన హిందీనేర్చుకొనుట అందరి భారతీయుల కర్తవ్యం. కాని ఈ కర్తవ్యం మాత్రమే హిందీపై సహజమైన అభిమానము కలిగించ లేదు. అది కావాలంటే హిందీవారు ఇతర భారతీయ భాషలపై ప్రత్యేకంగా దక్షిణ భారతీయ భాషలపై తగిన అభిమానం, సన్మానం చూపించవలెను తప్పకుండా సంపూర్ణ భారత వాసులు హిందీని మాతృభాషగా సన్మానించాలంటే, హిందీవారు కూడా ఇతర భాషలను కనీసం పినతల్లి భాషగా అంగీకరించవలెను." అని ఉపాధ్యాయగారి దృఢమైన విశ్వాసం. భాషా సమస్యపై నేడు జరుగుతున్న వాదోపవాదాలు, ఏర్పడుతున్న వైషమ్యాలు వీరి భావాలను సహనంతో స్వీకరించినప్పుడు మటుమాయమై భావ, భాషా సమైక్యతలతో పాటు జాతీయ సమైక్యతకు దోహదం చేసిన వారమవుతాం. ఆ శుభదినం కోసం ఎదురు చూద్దాం. ఈ మహాప్రయత్నం కొనసాగిస్తున్న శ్రీ ఉపాధ్యాయగారికి నా కృతజ్ఞతాభివందనములు.

# నిత్య సత్యాలు

* స్వార్థమును దరికి చేరనీయరాదు. స్వాభిమానం అలవరచుకోవాలి.
* సరైన అనుభవం లోనికి రాని విద్య, విజ్ఞానం ఎంత వున్నా ప్రయోజనం శూన్యం.
* భోగసుకంటే త్యాగమే ఎక్కువ మధురమైనది.
* ఇతరుల దోషాలను విస్మరించి క్షమించడం చేత కాకపోతే మన దోషాలు కొండంతలుగా పెరిగిపోయే ప్రమాదం ఉన్నది.
* బానిసకు బాధలు ఎక్కువ, స్వతంత్రుడికి బాధ్యతలు ఎక్కువ.
* యాచించడం నేర్వకూడదు; జీవించడం నేర్వాలి. పరులపై ఆధారపడటం నేర్వకూడదు; తన కాళ్ళపై నిలబడటం నేర్వాలి.
* నిరాడంబరమే మానవుని వెలలేని ఆభరణము.
* కోపంవల బుద్ధి మందగిసుంది. కోపానికి వసులమైపోతే యదార్థాన్ని చూడగల శక్తిని కోల్పోతాం. దానివల్ల వినాశనం పొందుతాం.
* దయగల హృదయమే దైవమందిరం.

ఈ శుభ సమయమున అల్లాబాద్ ఆంధ్రా అసోసియేషన్ వారిని అభినందించకుండా ఉండలేను. ఒక చంప తెలుగును మరచి పోకుండా, పోషించుకుంటూ, హిందీ వారితో సఖ్యతతో జీవితాన్ని గడుపుతున్న వారు నిజంగా అభినందనీయులే. వారు తెలుగు భాషాభివృద్ధికోసం పడుతున్న తపన, ఆవేదన వర్ణనాతీతం. అసోసియేషన్‌కు ఒకశాశ్వతమైన భవనమును ఏర్పర్చాలని, ఒక మంచి తెలుగు గ్రంథాలయమును అభివృద్ధి చేయాలని ఎంతో పట్టుదలతో కృషి చేస్తున్నారు. వారి ప్రయత్నం సత్వరమే సఫలీకృతం కావాలని కోరుకుంటున్నాను. అల్లాబాద్‌లోనున్న తెలుగు మిత్రులు నాయందు కనపరచిన ఆదరాభిమానములకు సర్వదా కృతజ్ఞుడను.

—కొమరగిరి

# స్వీకారం

" చైతన్య కవిత " (కవిత్వ పత్రిక)
వార్షిక సభ్యత్వం : రు. 10-00
సంపాదకులు : తంగిరాల సుబ్బారావు
ప్రతులకు : డా॥ టి. వెంకట సుబ్బారావు
తెలుగుశాఖ, బెంగుళూరు యూనివర్సిటి
జ్ఞానభారతి, బెంగుళూరు-560 056

" కాంతి శాంతి "
వెల : రు. 30-00
రచన : కొండిపర్తి శేషగిరిరావు
ప్రతులకు : కొండిపర్తి వీరరాఘవయ్య
బి 2093, హిల్ కాలని-508 202

" మిరియాలు " వెల : అమూల్యం
రచన : శ్రీ " కాట్రగడ్డ "
ప్రతులకు : 'కవితాజ్వాల', శ్రీ " కాట్రగడ్డ "
ఏలూరు - 534 002

" శ్రీశ్రీశ్రీ నారాయణస్వామివారి జీవిత చరిత్ర "
రచయితలు : శ్రీ గుండెపూడి వెంకటలక్ష్మీనరసింహ మూర్తి, శ్రీ అబ్బరాజు శ్రీనివాసమూర్తి
ప్రతులకు : శ్రీ పళకలూరి బొల్లయ్య
సత్యనారాయణస్వామి గుడి వీధి,
పాత గుంటూరు, గుంటూరు-522 010

" పాంచజన్యము - దేవదత్తము "
వెల : రు. 5-50

" శ్లోకాలు - శోకాలు " వెల : రు. 2-00
రచన వఝ్ఝల కాళిదాసు
: ఆంధ్ర విజ్ఞాన సమితి
No. 68, 'O' Road, Bistupur,
JEMSHEDPUR - 1

" భావచిత్రాలు " వెల : రు. 8-00
కృతికర్త : కొట్ర మల్లిఖార్జునశర్మ
ప్రతులకు : కె. యజ్ఞప్రసాద్
30-8-14 డాబా గార్డెన్స్, విశాఖపట్నం





# అందరికీ నమస్కారించి.....

1986 సంవత్సరం నవంబరు (పదకొండవ) శ్రీవాణి సంచికను అందజేస్తున్నాను. డిశంబరు సంచికతో రెండు సంవత్సరములు పూర్తి అవుతాయి. 1985 జనవరిలో "శ్రీవాణి" ప్రారంభించినప్పటి నుండీ ఎన్ని ఆర్థిక ఇబ్బంది లెదురైనప్పటికీ క్రమం తప్పకుండా అన్ని సంచికలను సకాలంలో అందించగలిగాను. పత్రికా నిర్వహణ అందులో ముఖ్యంగా సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక, విద్యా, విజ్ఞాన మాసపత్రికను నడపటం అంత తేలిక కాదు. సహృదయుల సహకారం ఉండటంవలన నిర్వహించ గలుగుతున్నాను. సహకారం అందిస్తున్న సహృదయులందరికి కృతజ్ఞతాభివందనలు. భవిష్యత్తులో గూడా తమ సహకారం అందించి "శ్రీ వాణి" ని ప్రోత్సహిస్తారని

## చందాదారులకు విజ్ఞప్తి

చాలా నెలల నుండి "శ్రీవాణి" చందాను రెన్యూవల్ చేయనివారు చాలామంధి ఉన్నారు. వెంటనే రెన్యూవల్ చేసి "శ్రీవాణి" ని ప్రోత్సహిస్తారని ఆశిస్తున్నాను. రోజురోజుకు కాగితం ధరలు, ప్రింటింగ్ రేట్లు పెరిగి పోతున్నాయి. ఇటువంటి తరుణంలో ఉత్తమ సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక పత్రికను నడపడం కష్టంగదా! సహృదయంతో ఆలోచించి వెంటనే రెన్యూవల్ చేస్తారని భావిస్తున్నాను.

## జీవిత సభ్యత్వం

కొంతమంది పెద్దలకు, ఆత్మీయులకు, గౌరవనీయు "శ్రీ వాణి" ని పంపుతున్నాను. సహృదయంతో ఆలోచించి జీవిత సభ్యులుగా చేరి సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక, విద్యా ప్రచారానికి చేయూత నిస్తారని విశ్వసిస్తున్నాను. అటివారి ఫోటోలు పంపిన యెడల "శ్రీవాణి" లో ముద్రించబడుతాయి.

## రచయితలకు మనవి

ప్రముఖ రచయితలకు శ్రీవాణి ని ఉచితంగా పంపుతున్నాను. చాలామంది తమ అమూల్యమైన రచనలను పంపి శ్రీవాణి ని ప్రోత్సహిస్తున్నందుకు అభినందనలు. రచయితల నుండి చందాలను ఆశించడం లేదు. అమూల్యమైన రచనలను మాత్రం ఆశిస్తున్నాను, ఆహ్వానిస్తున్నాను. అచ్చులో రెండు పేజీలకు మించకుండా ఉండే విధంగా వ్యాసములు పంపి సహకరించ ప్రార్థన. ఆమోదించని రచనలు తగినన్ని స్టాంపులతో చిరునామా కవరు పంపిన వారికి మాత్రమే త్రిప్పి పంపబడును. సుదీర్ఘమైన కథలు, వ్యాసములకు అవకాశం తక్కువ. గమనించ ప్రార్థన.

## మినీ కథలు, కవితలు

మినీ కథలు, కవితలను ఆహ్వానిస్తున్నాను. అచ్చులో ఒక పేజీకి మించకుండా మినీ కథలు ఉండాలి. కవితలు కాలముకన్నా మించిన వాటిని ఆమోదించడం కష్టం. సహకరించ ప్రార్థన.

## పుస్తక సమీక్ష

పుస్తక సమీక్షకు రెండు ప్రతులు విధిగా పంపవలెను. పుస్తక సమీక్ష చేసి పంపేవారు అచ్చులో ఒక పేజీ కన్నా మించరాదు.

## శ్రీ వాణి వార్షికోత్సవము

శ్రీవాణి ద్వితీయ వార్షికోత్సవము 1987 జనవరి 12 వ తేదీన విజయవాడలో వైభవోపేతంగా జరుప నిశ్చయించినాము. ఆ సందర్భమున ప్రత్యేక సంచికను తీసుకొని రా సంకల్పించాము. రచయితలు రచనల ద్వారా; వ్యాపారస్తులు, పారిశ్రామిక వేత్తలు ప్రకటనల (Advertisements) ద్వారా సహకారం అందిస్తారని ఆశిస్తున్నాను.

భవదీయుడు

కొమరగిరి కృష్ణమోహనరావు

సంపాదకుడు